చేసుకొంటున్నారు. అర్థం చేసుకొంటే ఈసమస్యలు తలయెత్తనే యెత్తవు. ఆ సూత్రాలలో మొట్టమొదటిది; అభారతీయాలన్నీ వెంటనే బహిష్కరించాలి. యంత్రపరిశ్రమలు, పాశ్చాత్యవిద్యలు, సంప్రదాయాలు పనికి రావు. ఇవి నిషిద్ధాలైతే దేశంలో నిరుద్యోగత్వం, కార్మికసమస్యలు, సాంఘికసమస్యలు ఉండవు. రెండవసూత్రం స్వయం సంపూర్ణత. ప్రతి ఒక్కడు తనపనులన్నీ తానే చక్కబెట్టుకోవాలి. అప్పుడు ఎచ్చులొచ్చులు లేక సంపూర్ణ ప్రజాస్వామ్య మేర్పడుతుంది మూడవసూత్రం వ్యక్తులకంటె సమాజం దేశం గొప్పవి. దేశంకోసం, సమాజంకోసం ప్రతిఒక్కడు సంపూర్ణ త్యాగంచెయ్యాలి. అలా చేస్తున్ననాడు- దేశం గొప్పదౌతుంది. దేశంలో వ్యక్తులు బాగుపడతారు. "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అన్న వాక్యంలో అర్థంలేదు.

ఈసూత్రాలను అమ్మాయమ్మగారు అక్షరాల అనుసరిస్తూ ఉన్నదనే చెప్పాలి. జైలులోనుంచి బయటికి వచ్చినది మొదలు ఆమె చందాలుపోగు చేసి హరిజనాశ్రమం నెలకొల్పి సాగిస్తూఉన్నది. ఈనాడు వందమందివరకు బాలబాలికలు ఆశ్రమంలో శిక్షణపొందేఅవకాశం ఉన్నదంటే, ఆకృషి అంతా ఒక్క అమ్మాయమ్మగారిదేనని చెప్పాలి. ప్రభుత్వం ఆమెపైనున్న అభిమానంకొలది ఇస్తున్న ప్రత్యేకపుగ్రాంట్లు ఏమీలేవు. తానే స్వయంగా చుట్టుపట్ల గ్రామాలన్నీ తిరిగి విరాళాలు వసూలు చేసుకొని వచ్చింది. ఆశ్రమ స్థలంకూడా విరాళంద్వారా వచ్చిందే! ఆమెఅంటే, ఆఉద్యమమంటే గిట్టని వారు ఏమేమో అనుకుంటారు. అదంతా నమ్మటానికి వీల్లేదు.

కావాలనుకుంటే రాజకీయ బాధితురాలుగా అయిదెకరాలపొలం సంపాదించి ఉండేది. కాని ఆమె దరఖాస్తుకూడా పెట్టలేదు. అలాంటి వ్యక్తి హరిజనవిద్యార్థుల వసతిభవనంకోసం సంపాదించినసిమెంటు, ఇనుము మొదలైనవాటిలో చాలావరకు బ్లాకుమార్కెట్లో అమ్మింది. లాభం సంపాదించిందంటారు. ఇరవైపుట్లు పండి యింటికి వస్తుంటే ప్రభుత్వానికి యెన్ని బస్తాలు అప్పగించిందో కనుక్కొమంటారు. ఆమె చెల్లెలిపేర బ్యాంకులో ఎంతనిలవవుందో లెక్కలు తేల్చుకోండి అంటారు. ఇవన్నీ ఏమాత్రం నమ్మటానికి వీలులేదనేచెప్పాలి. కాకుంటే ప్రతివార్షికోత్సవం ఏహైకోర్టు న్యాయమూర్తో, ఏ ప్రముఖమంత్రో, లేక ఏ భారత ప్రధాననాయకుడో వచ్చి ఎందుకుజరుపుతాడు? పాడులోకం! ఓర్వలేనిలోకం!! ఎంతఉదాత్త

చేసుకొంటున్నారు. అర్థం చేసుకొంటే ఈసమస్యలు తీ నిద్దరిని ఆశ్రమంలో
ఆ సూత్రాలలో మొట్టమొదటిది; అభారతీయాలన్నీ-లో పాతుకొని ఉన్న
రించాలి. యంత్రపరిశ్రమలు, పాశ్చాత్యవిద్యలు, ంది. రైతులు కూడా
రావు. ఇవి నిషిద్ధాలైతే దేశంలో నిరుద్యోగత్వాలుమాని. అన్నివర్గాల
సాంఘికసమస్యలు ఉండవు. రెండవసూత్రం స్వా ఆడుకోవటం ఇవన్నీ
ఒక్కడు తనపనులన్నీ తానే చక్కబెట్టుకోవాలి. అప్పు. ఇంతవరకూ కూలి
లేక సంపూర్ణ ప్రజాస్వామ్య మేర్పడుతుంది మూడవసూత్రాను వాళ్లకు చేసిన
సమాజం దేశం గొప్పవి. దేశంకోసం, సమాజంకోసం ప్రతిలో ఉంటే వాళ్ళకు
త్యాగంచెయ్యాలి. అలా చేస్తున్నాడు- దేశం గొప్ప తన కృషిమీద
వ్యక్తులు బాగుపడతారు. "దేశమంటే మట్టికాదోయ్ కదా నడుస్తున్నది.
లోయ్" అన్నవాక్యంలో అర్థంలేదు.

. పాడు దేవుడు

ఈసూత్రాలను అమ్మాయమ్మగారు అక్షరాల అను. స్త్రీసహజమైన
చెప్పాలి. జైలులోనుంచి బయటికి వచ్చినదిమొదలు ఆగా దొల్లుకొంటూ
చేసి హరిజనాశ్రమం నెలకొల్పి సాగిస్తూఉన్నది. ఈన్నది. కాని యగ్మత
బాలబాలికలు ఆశ్రమంలో శిక్షణపొందేఅవకాశం పొందుకొన్నది. లేచే
అంతా ఒక్క అమ్మాయమ్మగారిదేనని చెప్పాలి. ప్రభుత్వన ఉన్న కుర్చీలో
మానంకొలది ఇస్తున్న ప్రత్యేకపు గ్రాంట్లు ఏమీలేవు.
చుట్టుపట్ల గ్రామాలన్నీ తిరిగి విరాళాలు వసూలు చేశ
స్థలంకూడా విరాళంద్వారా వచ్చిందే! ఆమెఅంక్షే ఎయి, ప్రక్క గుడ్డలు
వారు ఏమేమో అనుకుంటూరు. అదంతా నమ్మటాని సి ఉన్నాయి. టేబిలు
ఉన్నవి. ఆశపిల్ల ఒక
కావాలనుకుంటే రాజకీయ బాధితురాలు
చిన్నవాళ్ళిద్దరూ గుప్
సంపాదించి ఉండేది. కాని ఆమె దరఖాస్తుకూ
అయినా ఇంట్లో అటూఇటూ
వ్యక్తి హరిజనవిద్యార్థుల వసతిభవనంకోసం స తా చీమలు పారు కాడినట్లయి
మొదలైనవాటిలో చాలావరకు బ్లాంకూరి
ది.
డించిందంటారు. ఇరవైపుల్లు పండి యిం
బస్తాలు అప్పగించిందో కనుక ంలితంద్రుల పూర్వస్థితిని పొగడింది.
ఎంతనిలవవుందో లెక్కలు తైను, తెలివితేటలను మెచ్చుకున్నది. ఇప్పుడు
టానికి వీలులేదనేచెప్పాలి టు కన్నీరుపెట్టింది. "అన్నీ చీకటి రోజులే
న్యాయమూర్తో, ఏ ప్రమ వెన్నెల, కొన్నిరోజులు చీకటి. సుఖదుఃఖాలు
వచ్చి ఎందుకుజరుపుకా దార్చింది.

"లలితమ్మా, ఇటు చూడు. పెద్దపిల్లల్ని ఇద్దర్నీ ఈ రెండు నెల్లూ ఆశ్రమంలో ఉంచుకుంటాను. ఈలోపున మీ వ్యవహారాలన్నీ ఒక ఒడ్డున పడతాయి. నీకు కాస్త ఒంట్లో స్తిమితపడుతుంది." అని వచ్చినపని కాస్తా బయట పెట్టింది.

లలితకు దుఃఖం కోపం ఒక్కసారి ఉప్పెనలాగా వచ్చాయి. రోగ దౌర్బల్యం వల్ల బావురుమని ఏడ్చింది. దానితో అమ్మాయమ్మగారి గుండె దడదడ లాడిపోయింది.

"ఎంత చితికిపోయిన వాళ్ళకైనా కన్నపిల్లలు ఎక్కువ కారమ్మా. డబ్బు లేకపోయినా, కుల గౌరవాలున్నాయి. మాలామాదిగ పిల్లల పొత్తుకు పిల్లల్ని పంపించేదా? ఈ బొందిలో ప్రాణముండగా అలాంటిది జరగదు. ముమ్మాటికీ జరగదు" అన్నది లలిత.

"నేనన్న మాటలో తప్పేముందమ్మా?" అని కలవరపడుతూ అన్నది అమ్మాయమ్మ.

"మీకూ, మీ దేశభక్తికీ పదివేల నమస్కారాలు. ఉన్నదో లేదో మా పాట్లు మేము పడతాము. ఎందుకు చెల్లాచెదరు చేస్తారు? మమ్మల్నీ, మా పిల్లల్నీ ఒకచోటనే పడి ఉండనీయండి. మీ ఆశ్రమానికి పిల్లలేమీ తక్కువ కాదు. మీ చెల్లెలి సంతానం మద్రాసులో చదువుతున్నది గా !" అన్నది.

అమ్మాయమ్మ మండిపడ్డది. ఒక్క క్షణం మరి కూచోలేకపోయింది. లేచి తిరిగి ఆశ్రమంవేపు దారితీసింది. ఆమె హృదయంలోనో భావాలలోనో ఎక్కడో గాయమున్నది. లలిత అమాయికంగా అన్నమాట పోయి అక్కడనే తగిలి ఉంటుంది. లేకపోతే అంత కోపపడవలసిన అవసరం లేదు.

లలిత వెక్కి వెక్కి యేడుస్తూనే ఉంది. అమ్మాయమ్మగారు అటు పోగానే యిటుచంద్రశేఖరం వచ్చాడు. ఆతడు వచ్చేటప్పటికి లలిత కంటి వెంట నీరు కారుతూ ఉంది. అతడు కాళ్ళు తొక్కుకొన్నాడు. కారణం అడిగాడు. ఆమెకు ఏడుపు ఆగలేదు. మంచం ప్రక్కన ఉన్న కుర్చీలో కూర్చుని ఆమె తల నిమురుతూ మళ్ళీ అడిగాడు. అమ్మాయమ్మగారి మాట లన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది. అతడు మండిపడ్డాడు. చెడాబడా తిట్టాడు.

తన భార్యను, పిల్లలను తనకు కాకుండా చేయటానికి పూనుకొన్నది. తాను వచ్చినప్పుడే ఉండకపోయింది - ఏమి చేసేవాడో తేలేది.

లలిత అతని చెయ్యిపట్టుకొన్నది. "ఏమైనా కానీండి, మిమ్మల్ని వదిలిపెట్టి పోతామా! ఎక్కడికి పోతాము?" అంటూ అతని చేయి కన్నీటితో అభిషేకించింది. "ప్రపంచమేమైనా మనలను ఎవరూ విడదీయలేరు," అంటూ ఆ బాలెంతరాలిని ఓదార్చాడు.

# 7

మల్లయ్య ఆ ఊరికి అంతకూ షావుకారు. ఎంత ఉందో మాత్రం ఎవరూ చెప్పలేరు. ఇన్‌కంటాక్సు అధికారులకు తేలని లెక్కలు మనబోటి సామాన్యులకు యెలా తేలుతవి? ఉన్న భూమియేమో కరణాల లెక్కలో ఉన్నది. అది దాయటానికి వీలు లేదు. దానిని బట్టిచూస్తే, మేనమామకు పిల్లలు లేక వచ్చినది పాతిక ఎకరాల మాగాణి. పినతల్లి ప్రేమ కొందికి వ్రాసియిచ్చినది ఏభై ఎకరాలు. కూతురు భర్త చనిపోవటంవల్ల ఇప్పుడు భుక్తంలో ఉన్నది వందెకరాలు. ఈ కండ్రిక కూతురు పోతే తిరిగి వారసులకే సంక్రమిస్తుంది. పోతే తండ్రి అప్పగించి పోయినది వంద కరాలు మాత్రమే. ఈ పొలం కూడా అంత మంచిది కాదనే చెప్పాలి. సాలీనా పండేది ఒకటే పంట. అదికూడా యెకరానికి ముప్పందుమే రాలుతుంది.

సంసారం కూడ పెద్దదే. మల్లయ్య, అతని భార్య, ఒక కొడుకూ. ఒక కూతురూను. వీళ్ళలో సంపాయించే వాళ్ళుయెవరూ లేరు. అంతా తినేవాళ్ళే! ఇది చాలదన్నట్టుగా యాభైయో పడిలో ఒక కొడుకు పుట్టాడు. మల్లయ్య జ్యోతిష్కుణ్ణి కనుక్కుంటే వాడు ఎంతో కాలం బ్రతకడని చెప్పాడు. దారిద్ర్యంలో ఉన్న మల్లయ్యకు చాల తేలిక యిచ్చి వుండాలి. పైకి యెక్కడా అనలేదు కాని — ఆ సంగతి మనకూ అవసరం.

ఆయన చదువుకోలేదు. కాని కనీసం 18ఏళ్ళు కష్టించి చదివినవాళ్ళకు తెలియని శాస్త్రంకూడా ఆయనకు కొట్టినపిండే. అతని ప్రతిభ అలాంటిది. ఉదాహరణకు జగత్తులోని శక్తి తీసుకుందాము. ఈశక్తి అంతానియమితం. దీన్ని పెంచలేము తగ్గించలేము. ఎప్పుడూ అవ్యయమే! ఈ సిద్ధాంతాన్ని

రుజువు చేయాలంటే యెంత పరిశోధన కావాలి? ముఖ్యంగా సూర్యుడు చల్లబడిపోతున్నాడని ఇటీవల బయలుదేరిన సిద్ధాంతాన్ని ఖండించాలంటే మాటలా? పుల్లయ్య ఇట్టే రుజువు చేస్తాడు. యెలాంటి ఉపకరణాలు లేకుండానే సత్యాన్ని సాక్షాత్కరింప జేస్తాడు. ప్రపంచంలో ఉన్న శక్తే డబ్బు. ఈ డబ్బు పెరగదు. ఒకడు సంపాదిస్తున్నాడంటే అంతమేగా ఇతరులు నష్టపడ్డారన్నమాట. అలాగే పుల్లయ్య డబ్బు కూడ బెడుతున్నాడంటే అంత లెక్క తాను నష్టపడుతున్నాడు. తన షావుకారు తనం నిలబెట్టుకోవాలన్నా, తనకు ఉన్నది కాపాడుకోవాలన్నా వెయ్యికళ్ళతో చూస్తూ ఉండాలి. తాను అలా చూస్తున్నాడు. కాబట్టే ఊళ్ళో బ్రాహ్మణుల అస్తులు మాన్యాల దగ్గరనుండి దొడ్డిదోవలు దాకా తనవుద క్కాయి. తానుచూడక పోతే ఏమయ్యేది? ఇతరులు తన్నుకపోయేవాళ్ళు. ఇదివరకు చంద్రశేఖ రాన్ని కనిపెట్టి ఉండలేక దుంప తెగిపోయింది. ఇప్పుడు అతన్ని గురించి భయపడవలసిన పనిలేదు. కాని పుల్లయ్య సంగతే తేలకుండా వచ్చింది.

పుల్లయ్య నిజంగా హామీ ఉన్నాడా లేదా? చంద్రశేఖరం దెబ్బతిని ఉన్నాడు. ప్రజలకి జంకి ఉండటం, మాట నిలబెట్టుకోవలసిన అవసరం నేడెంతైనా ఉన్నది. కాబట్టి ఈ తప్పుడు తనానికి దిగే అవకాశం లేదు. ఒకవేళ దిగాడే అనుకొన్నా పుల్లయ్యవంటి వాడికి తప్పుఅంటగట్టి రుజువు చేయటమంటే మాటలా ? చంద్రశేఖరం అంత లోకం తెలియని వెర్రివెంగళప్ప కాడు. ఎంత అనుభవం లేకపోయినా ఫ్యాక్టరీ వ్యవహారంతో నెత్తి బొప్పికట్టి తెలిసివచ్చి ఉండాలి. అలాంటప్పుడు నిర్హేతుకంగా పుల్లయ్య మీద వ్యవహారం నడపటానికి దిగి ఉండడు. పుల్లయ్యే దురాగతానికి దిగి ఉండాలి !

అతడు ఈ పనికి ఎందుకు దిగాడు ? మిల్లు కాజేయటానికి వీలు లేదు. ఊరువాడీతే కోడిపిల్లను తన్నుకుపోయినట్లు తన్నుకుపోతారు. ఇతనిదాకా రానివ్వరు. శేఖరం ఇంటిమీద కన్ను ఉన్నదా ? అది తనకు తనఖా పెట్టి ఉంటే అతనికి ఎలావస్తుంది? కాబట్టి అదికూడా కాదు. మరేమిటి పుల్లయ్య ఉద్దేశం ? అదే బోధపడకుండా వచ్చింది. వీడి తస్సాదియ్యా ! శేవలేని పుల్లయ్యకు ఇవాళ బొమ్మలు బారెడై కూచున్నవే! ఏది ఎలావున్నా పెద్ద ఎత్తే ఏదో ఎత్తాడు. మెదలకుండా ఉంటే లాభంలేదు. అతని వేలితోనే అతని కన్ను పొడవాలి. ఈ వ్యవహారంలో యెలాగైనా పుల్లయ్యను జైలుకు

పంపిస్తే ఊళ్ళో మరి తలెత్తే మగాడే ఉండడు. చితికిన చంద్రశేఖరం కోర్టులో గెలిచినా తనకు ఎలాంటి ప్రమాదం లేదు.

మల్లయ్యకిక పుల్లయ్యను నూర్వారైనా సాధించటం అవసరమై పోయింది. అతని వేళ్ళు మీసాలు దువ్వాయి. "అరే గంగాధరం! కాస్త ఇటు రారా!" అని కేక వేశాడు. దొడ్లో పన్నెండేళ్ళవాడు ఒంటరిగా బచ్చాలాడుకుంటూ పలకలేదు. మరోసారి కేక వేశాడు. జారిపోతున్న లాగు పైకి ఎగలాగుకుంటూ వచ్చాడు. చొక్కా బుజాలవద్ద చినిగి ఉన్నది. అది మల్లయ్య కంటబడ్డది.

"ఓరి వెధవ! నీ దగ్గర కత్తులున్నాయిగా?" అన్నాడు.

"చాకు కొనిమ్మంటే ఇవ్వలేదే. నాకు కత్తులెక్కడనుంచివచ్చాయే"

"నీ తెలివితేటలు మండినట్లే ఉన్నాయి. వీరయ్య డాబాలో కూచుని ఉంటాడు కాని ఒకసారి పిల్చుకురా. ఇక్కడున్నట్లు రావాలి."

"ఎందుకే?"

"నీ మొఖానికి-చెయ్యమన్న పని చెయ్యవు. నీకున్న తెగులే గా."

"వీరయ్యా, వీరయ్యా నువ్వు మాయింటికొస్తే మక్కెలిరగతంతా నంటున్నాడు మా నాన్న అని చెప్పివస్తా."

"మళ్ళీ ఇంటికివస్తావా?"

"ఓ" అని చేతులతో చక్రాలుకొడుతూ పరుగెత్తుకువెళ్ళాడు. మల్లయ్య లోపలికి వెళ్ళి పాయగల రెండు పొగాకు కాడలు పట్టుకువచ్చాడు. ఒక కాడ చక్కగా ఈనెలుతీసి చుట్టచుడుతున్నాడు. ఇంతలోనే వీరయ్య వచ్చాడు.

"పిలిచావా బావా?" అంటూ గచ్చుఅరుగుమీద పైపంచకొసతో అటూఇటూ దుమ్ములేకుండా కొట్టి కూర్చున్నాడు.

"ఇదిగో కాడ, చుట్టకాల్చిచెప్పు ఎలా ఉందో? ఉత్తరాదిదని మొన్నొకడు వచ్చి ఇచ్చిపోయాడు. నాకు అనుమానంగా ఉంది."

వీరయ్య పొగాకు నాణెం, గుడ్డ నాణెం ఎన్నటంలో మొనగాడు. అతడు వాసనచూచి, "ఉత్తరాదిదే కాని సరిగా పదును చేయలేదు." అంటూ చుట్టచుట్టి ముట్టించాడు.

"ఏదో జిరాయితీ హక్కు అంటున్నారు. వచ్చే ఏడాదినుంచి వ్యవసాయం పెడదామనివుంది. ఏమంటావు?"

"ఏమనేది ఏముంది! మగతాలకిస్తే భూమి గుల్లయిపోవటం తప్ప మరేమీ ప్రయోజనం లేదు. మళ్ళీ చేలు చేలు కావాలంటే యెంతఖర్చు పడాలి? అందులోనూ రెండో పంటకు అలవాటు పడ్డారు. పొలాలు యెందుకూ పనికిరాకుండా పోతున్నాయి. అయితే ఎడ్లు ఏడెనిమిది జతలన్నా కావాలా?"

"ఈయేటికి రెండుజతలు చాల్లే. ఇప్పుడు చేయదలచుకున్నది ఇరవై యెకరాలేగా!"

"మొన్ననే చూచివచ్చాను. మూడుమూళ్ళు, మూడుమూళ్ళ బెత్తెడు ఉంటాయి. మంచి గిత్తలు. పుల్లయ్యగారి గిత్తలు వాటిముందు బలాదూరు దియ్యను పనికిరావు. కాకపోతే పదిరూపాయలు హెచ్చు చెబుతున్నాడు. ఏమి పుటక ఏమి తలకట్టు! వాటిని వదిలి రాబుద్ధి పుట్టలేదంటే నమ్ము."

"అన్నట్లు కొన్నాళ్ళు మాధవయ్యగారి పనిలో ఉన్నావు కాదూ?"

"లేకేమీ నాలుగేళ్ళున్నా, ఆ యింట్లో యేమి జరగవలసివచ్చినా నాచేతి మీదుగా జరిగేది.?"

"పుల్లయ్య హామీ సంగతి యేమన్నా నీకు మాధవయ్య చెప్పాడా? అతడేనటగా సాక్షి సంతకం చేసింది."

వీరయ్య తన తెల్ల జుట్టు గోకు కున్నాడు. "సరిగా జ్ఞాపకం రావటం లేదు" అన్నాడు.

"మళ్ళొకసారి ఆలోచించి ఏ సంగతి చెబుతావుగా!" మల్లయ్య యెక్కడికో బయలుదేరటానికి నిలబడ్డాడు.

"అలాగే," అని వీరయ్య చుట్ట అవతల పారేసి ఒకటి రెండడుగులు వేశాడు. "ఇదిగో మంచిరోజు చూచి ఎడ్లకు బయలుదేరుదాము," అని షావుకారు హెచ్చరించాడు. తప్పకుండా వస్తానంటూ వీరయ్య వెళ్ళిపోయాడు.

వీరయ్యకు అప్పటినుంచీ అదే స్మరణ అయిపోయింది. తనమీదనే చంద్రశేఖరం భవితవ్యం ఆధారపడివుంది. మాధవయ్యగారు యెప్పుడన్నా

యీ సంగతి చెప్పివుంటాడా? చెబితే ఎప్పుడు చెప్పివుంటాడు? మెట్ట సాలు దున్నే రోజులలోనో లేక మామూలు రోజులలోనో అయివుండాలి. మామూలు రోజుల్లో మాత్రం కాదు. అప్పుడు ఉబ్బసం వచ్చి మాధవయ్య గారు మంచం దిగలేదు. గడ్డిదూగర ఆయన తత్వానికి పడదు. వామిలో గడ్డి దూసినా, సూర్పిళ్ళలో ఉన్నా, వామివేసినా ఉబ్బసం వచ్చేది. అప్పుడు కాదు. తొలకరి రోజులలోనే అయివుంటుంది. ఎండు గడ్డిమీద క్రిందటి రోజునే నాలుగు దుక్కులవర్షం కురిసింది. కాలువలు వదిలారు. మబ్బుపట్టి చల్లగావుంది. ఆ రోజున తాను, మాధవయ్యగారు కోటేర్లు వేసుకొని దుక్కి దున్నటానికి పడమటి పొలం పోతున్నారు. అవును-సరిగా అప్పుడే చెప్పాడు. పుల్లయ్యగారు శేఖరంగారికి హామీ ఉన్నారనీ, తాను సాక్షి సంతకం చేశాననీ చెప్పాడు. ఆ మాటలు ఇప్పటికికూడా చెవుల్లో వినిపిస్తూఉంటే చెప్పలేదనుకోవటానికి వీలులేదు. ఆగొంతు, ఆ మాటలు ఇప్పుడు వినబడుతూనే ఉన్నవి. తన కల్పనే అయితే అవి యెలా వినిపిస్తాయి?

మల్లయ్యగారికి ఈ గొడవంతా దేనికి? ఈ వ్యవహారంలో ఆయనకు వచ్చి వళ్ళో పడేదేముంది? ధర్మంకోసమే ఆయన తాపత్రయ పడుతుండాలి.

మల్లయ్యగారు ఆలోచించమని చెప్పిన మూడో రోజున అతను ఇంటిముందు అరుగుమీద మునిమాపువేళ కూర్చుని వుండగా వీరయ్య కనిపించి చెప్పాడు.

"ఆలోచించానండి! జ్ఞాపకం వచ్చింది. తొలకరిరోజుల్లో మాధవయ్యగారు అన్నారు. పుల్లయ్యగారు శేఖరంగారికి హామీ ఉన్నారనీ తాను సాక్షి సంతకం చేశాననీ చెప్పారు. చచ్చి ఏలోకాన ఉన్నాడో ఆయన అబద్ధమాడడు. కాటికి కాళ్ళు చాచుకొన్న నాకూ అబద్ధం ఆడవలసిన పని అంతకన్నా లేదు."

"మంచిపనే జరిగింది. నీకే జ్ఞాపకం రాకపోతే పాపం చంద్రశేఖరానికి జైలు తప్పేది కాదు. భగవంతుడు నిన్ను సాయం పంపుతున్నాడు. పోయి నిన్ను సాక్ష్యం వేసుకోమని చెప్తా. అతడు నీ రుణమెన్నడూ తీర్చుకోలేడు." అన్నాడు. వస్తానండీ అని వీరయ్య బయలుదేరి పోతుం

దగా "ఇదిగో వీరయ్యా! కోమటిఇంట్లో మంచి పుగాకు లేదు. నెత్తిమాటల వాళ్ళుకూడ రావటం లేవల్లే ఉంది, సరియైన కాడ దొరక్క ఇబ్బంది పడుతుండాలి. ఈ నాలుగు కాడలు తీసికెళ్ళి కాల్చుకో," అని మల్లయ్య సవాసేరు పుగాకు ఇచ్చి పంపాడు.

మల్లయ్యగారికి యెంత ధర్మబుద్ధి! పేదలమీద యెంత కనికరం! దీపాలు పెట్టారు. ఆలోచనలో మునిగిఉన్న మల్లయ్య ఉత్తరీయం వదులుమూక మోకాళ్ళకు చుట్టుకొని వెనుకకూ ముందుకూ ఊగుతున్నాడు. ఆసమాధిలో సగుణబ్రహ్మమే తోచిందో, నిర్గుణ బ్రహ్మస్వాదమే కలిగిందో చెప్పలేము. అతడు కళ్ళువిప్పి చూచేటప్పటికి ప్రక్కయింట్లో గొంతెత్తి చదువుతున్న విద్యార్థిగొంతు వినిపించింది.

"నాన్నా నీకు అక్కాయి నీళ్ళుతోడింది" గంగాధరం చెప్పాడు.

"నువ్వుపోసుకో. నేనువచ్చేటప్పటికి కాస్త ఆలస్యం అవుతుంది" అని కొడుకుకు చెప్పి ఉత్తరీయం బుజాన వేసుకొని చీకట్లో నేబయలుదేరాడు.

పంతులు ఆవులిస్తే ప్రేవులులెక్కపెడతాడు. ఎలా ఒప్పించేటట్లు! కంపనా కట్టెనా కాలడే, ఎలాగబ్బా? ఊళ్ళోఅన్ని తత్త్వాలు కాచి వడపోశాడు. తండ్రికున్న మెతకదనమేఉంటే ఊరంతా ఒకకొలికికి వచ్చిఉండేది. తనబోటి వాళ్ళంతా శంకరమూన్యాలుపట్టి ఉండేవాళ్ళు. మనస్సుకు నచ్చితే తప్ప వినడు. డబ్బూ గిబ్బూ ఏమీ ప్రయోజనం లేదు. అతడు పూనుకొంటే కాని పని కాదు. ఎలాగైనా మొదలువంచి పని చేయించాలి కొంపతీసితనకే యెసరు తేదుకదా! అలాంటి దుర్మార్గాలకు రాడు. వచ్చినా తనతో వ్యవహారమంటే నిప్పుతో తల గోకుకొనటమని తెలుసు. ఎరిగి ఎరిగి యెవడైనా అద్వైతాన పడతాడా?

మల్లయ్యకు భజగోవింద శ్లోకాలు వినిపించాయి. బయట వాకిట్లో నిలబడి, "పంతులూ" అని కేక వేశాడు. లోన సత్యనారాయణ పంతులు పిల్లవాడికి తెలుగు పాఠమేదో చెబుతున్నాడు. కుర్రవాడు "నాన్నగారూ, స్కూల్లో తెలుగు పండితులు ఇలా చెప్పారే" అన్నాడు. "అలా చెబితే చాలా దోషాలు వస్తాయి, నేను ఇప్పుడు చెప్పిందే సాంప్రదాయం"

"ఇలా రేపుపరీక్షల్లోవ్రాస్తే గుండుసున్నా పెడితే?"

"ఎందుకు పెడతారు సరిగ్గా వస్తే?" మల్లయ్య మళ్ళీ కేక వేశాడు. ఈసారి వినిపించింది. "ఎవరు వారు?" అంటూ పంతులు వీధిగుమ్మంలోకి వచ్చాడు.

"నేనే పంతులూ."

సత్యనారాయణ ఆ చీకట్లో ఎగాదిగా చూశాడు "మీరా, లోపలికి వెళ్లుదాము రండి."

"ఎందుకులే! ఇక్కడే కూర్చోవచ్చుగా?" మల్లయ్య అరుగుమీదికి చేరాడు.

"అరే పెద్దబ్బాయి, లాంతరు చాప పట్టుకురారా!" సత్యనారాయణ కేక వేశాడు.

"ఇప్పుడు ఆ శ్రమంతా దేనికిగాని అటు కూర్చోండి చెబుతాను."

"ఈ చీకట్లోపడి మీరు రావాలా? అబ్బాయిచేత కబురుచేస్తే రాకపోయిందా?"

"పడమటేపు వెళ్ళి వస్తూన్నాను—దారిలోనే గదా ఇల్లు, మాట్లాడిపోతే సరిపోతుందని పిల్చాను."

ఇంతలోనే పంతులు పెద్దకొడుకు లాంతరూ, చాప పట్టుకొచ్చాడు.

"లాంతరు అక్కర్లేదులే. లోపలికి తీసుకువెళ్ళు" అన్నాడు మల్లయ్య. పంతులు అరుగుమీద చాపపరచి కూర్చొనుకున్నాడు.

"ఇప్పుడదంతా దేనికిగాని, ఈ ఒక్కమాట చెవినేసిపోదామని వచ్చాను. అవునంటే అవుననో, కాదంటే కాదనో చెప్పాలి."

"ఊళ్ళో ఇంతమంది పెద్దలుంటే నేను చెప్పగలిగిందేమిటి?"

"తెరనా, ఉన్నారు. మనసు కుదరాలికదా! సరేకాని ఈ నెల రోజులూ మళ్ళీ ఎవరిదగ్గరా అనకండి. మీ షావుకారుతో కూడా అనవద్దు సుమా!"

"నేను పుల్లయ్యగారి గుమాస్తానన్న సంగతి మీకు తెలిసిందేకదా!"

"ఎక్కడి పంతులవయ్యా? ఒకళ్ళజోలి మనకెందుకు పడుతుంది? ఎప్పుడన్నా ఇతరుల వ్యవహారంలో నేను జోక్యం కలిగించుకొన్నట్లు విన్నావా?"

"అబ్బెబ్బే! అది కాదు; నా సంగతేదో చెప్పుకొంటున్నాను. అంతే."

"అసలు సంగతేమిటంటే బస్సు పర్మిట్టుకు పెట్టాను. అది పది పదిహేను రోజుల్లో వస్తుంది. ఆరోజున రూపాయలు పండుతా యంటే నమ్మో. బస్సులు కూడా అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి. అయితే ఈ వ్యాపారం ముక్కా మొగం నాకు తెలియదు. ఆ సంగతి నీకు తెలుసు. ఎవర్నొనా నమ్మితే వాడు నట్టేటముంచితే ఏమిచేయను? అసలే నాకు పెద్ద అనుమానం. నువ్వైతే అన్ని విధాలా సమర్థుడివి కుదుర్కొస్తావు. నీమీద ఉన్న నమ్మకం నా పిల్లలమీద కూడా లేదు. పెట్టుబడి అంతా పెట్టుకొని లాభంలో పాతిక వాటా నీకిస్తాను. ఇప్పుడు గిడుతున్న దాని కంటె రెండు మూడు రెట్లు ఎక్కువ గానే గిడుతుంది — కాని తక్కువ గిట్టదు. దీనికి ఏమంటావు? ఏదో ఒకటి తేల్చి చెప్పు."

పంతులు సావధానంగా విన్నాడు. అతని మనస్సులో అనేక ఆలోచనలు స్ఫురించాయి. పుల్లయ్యగారు ఎటులేదన్నా సంవత్సరానికి ఆరు వందలదాకా ముట్టజెబుతున్నాడు. మల్లయ్య చెప్పినమాట బాగానే ఉన్నది. ఈ రోజుల్లో అతడు చెప్పినదానికంటె ఎక్కువే గిట్టుబాటు అవుతుంది. ఎందుకు ఒప్పుకోకూడదు? ఒప్పుకోకపోతే ఈ సంసారం ఈదేదెట్లా? ఏటేట కుటుంబ వ్యయం పెరుగుతున్నదే కాని తరగటం లేదు. తనకు ఇలాంటి ఉపకారం చెయ్యటానికి ఈయనకు యెందుకు బుద్ధిపుట్టింది? తా నెన్నడూ ఆయనకు అణుగింజంతైనా సహాయం చేసియెరుగడు. అంతమాత్రం చేత ఉపకారం చేయరాదని ఉన్నదా? లేదు కాని ఇన్ని కోట్ల జనాభా ఉంటే తనకే యెందుకు చేయాలి? తనపై నమ్మకం కుదిరింది కాబట్టి చేస్తుండవచ్చును. తాను ఒక్కడేనా నమ్మకస్థుడు? తతిమ్మా వాళ్ళంతా దొంగలా? కాదు. అయినప్పుడు ఇందులో ఆంతర్యమేదో ఉండి ఉండాలి. ఏమిటది? ఏదో ఉందనుకొందాము. తాను ఒప్పుకొంటే నష్ట మేమిటి? వ్యాపారం సరిగా సాగటం మొదలు పెట్టిన తరువాత తనను బయటికి పంపించవచ్చును. అప్పుడు ఏమి చేస్తాడు? తొలగించటానికి వీలు లేకుండా కంట్రాక్టు బిగించుకో వచ్చును. కంట్రాక్టుకు కూడ అందని చిక్కుల్లో పెట్టి బయటికి గెంటవచ్చును. మానవుడికి ఆ మాత్రం తెంపు సాహసం లేక పోతే ఎలా అభివృద్ధికి వస్తాడు? ఇంతవరకూ అవి ఒప్పుకో

వచ్చు. అయితే మరొక విషయం ఉన్నది. తన తండ్రి, తాను ఇన్నేళ్ళు పుల్లయ్యవద్ద పనిచేశారు. అతడు కన్నులకు కప్పు కొంటున్నాడు. తాను గుమాస్తా గిరినుంచి మానుకోవటంవల్ల ఆయనకేమైనా తాను వ్యక్తిగతంగా అన్యాయం చేసిన వాడవుతాడా? తాను వ్యాపారంలోకి పోవటం వల్ల ఆయనకు తానేమి కష్టం కలిగిస్తున్నాడు? మరి ఆయనతో కూడా చెప్ప వద్దని యెందుకన్నాడు? ఇంకా పర్మిట్లు రావలసి ఉన్నది కనక పుల్లయ్య గారేమైనా అధికార్లను పట్టుకొని విఘాతం కలిగించవచ్చు నన్న దృష్టితో అనివుండవచ్చును. కాక...ఫోర్జరీ వ్యవహారానికి మల్లయ్యకూ ఏమైనా సంబంధం ఉన్నదా? నేరుగా ఎలాంటి సంబంధం లేదు. శేఖరం గారితో చుట్టరికం కూడా లేదు. పార్టీ అభిమానాలు ఏడ్చాయా? వాటికి ఒక నీతి నియమం ఏడిస్తే ఊహించుకోవచ్చు. ఏదైనా ఉంటే మల్లయ్యకు ఫోర్జరీ వ్యవహారం లోనే సంబంధం వుండాలి. దాన్నిబట్టి పుల్లయ్యగారికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పించటం కోసమని తనపై మల్లయ్యకు ఈ అవ్యాజానురాగం కలిగి ఉంటుంది. అంతేకాని తాను నమ్మకస్థుడనీ కాదు. సమర్థుడనీ కాదు. తనకు బస్సుల వ్యవహారం బొత్తిగా తెలియదని తెలిసికూడా, అడుగుతున్నాడంటే ఇదే కారణం కావాలి.

అయితే పుల్లయ్యగారికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పటానికి సిద్ధమైతే మల్లయ్య చెప్పిన దానికి ఒప్పుకోవచ్చు. పుల్లయ్యగారు అన్యాయానికి దిగినప్పుడు తాను యథార్థం చెబితే తప్పు ఏమున్నది? చూస్తూ చూస్తూ అన్నెము పున్నెము ఎరుగని ఒక వ్యక్తిని జైలుకు పంపించటం కంటె దురాగతమేముంటుంది? అయితే ఇంత కాలంనుంచి తన్ను, తన కుటుంబాన్ని ఆదుకుంటున్న పుల్లయ్యగారికి అపకారం చేస్తాడా? పైగా ఆయన ఉద్దేశమేమిటో ఇంతవరకూ తేలలేదు. రేపు ప్రొద్దున్నే పోయి తనది తప్పని ఆయన ఒప్పుకోవచ్చును. కేసు యెత్తి వేసుకోవచ్చును. తొందరపడి ప్రతికూల పక్షాన చేరటంకాని, ధర్మాధర్మాలు నిర్ణయించటంకాని కూడదు.

ఇంతకూ మల్లయ్యకు ఏమిచెప్పాలి?

"ఒక ముక్క చెప్పటానికి ఇంత ఆలోచన దేనికి పంతులూ అన్నాడు మల్లయ్య.

"ఆలోచించవలసిన పనేముందండీ? కాకపోతే మంచిది ఎప్పుడా-అని చూస్తున్నాను."

"ఎప్పుడు మంచిదని నిశ్చయించారు ?"

"నా నామ నక్షత్రానికి ఈ ఆరునెల్లు యేమాత్రం బాగాలేవు. ఎందులో చేయి పెట్టినా అంతవరకు మాడి పోతుంది."

"ఎంత ఛాందసుడివయ్యా పంతులూ ! నీలా మడికట్టుకు కూర్చుంటే ఇక తిండి తినకలసిందే" మల్లయ్య వికటంగా నవ్వాడు.

"మరేమి చెయ్యమంటారు? నా యిష్టమే అయితే ఎలాగో ఓలాగు సర్దుకోవచ్చు. మా నాన్నగారు ఊరుకోరు."

"మనసు కుదిరితే అన్నీ సరిగానే ఉంటాయి. మనసు కుదరనప్పుడు అన్నీ ఎదురే. అల్లుడు వచ్చేదాకా అమావాస్య ఆగుతుందా? లక్ష్మి వస్తానంటే మోకాలడ్డరాదు పంతులూ !"

"మీరు బాగుకోరి చెబుతున్నారు. మరేమి చెయ్యను ? తెలిసి తెలిసి చద్దరోజుల్లో దిగటం నాకేమాత్రం ఇష్టంలేదు. మా నాన్నగారు అంత కన్నా ఒప్పుకోరు. నమ్మి కావాలని చదువుకున్న శాస్త్రాన్ని ఎవ్వడూ ధిక్కరించలేడు."

"అంతేనా ?"

"క్షమించండి. ఈ ఆరునెల్లు పోయిం తరువాత ఏగడియన రమ్మంటే ఆగడియలో వచ్చివాల్తాను."

"సరే వస్తా"నంటూ మల్లయ్య - పంతులు ఇంటిదగ్గరనుంచి బయలుదేరాడు. "పంతులంటే పంతులా ? అన్నంలోని పలుగురాయి కాదూ" అనుకొన్నాడు.

## 8

క్రోడెదూడ పాలుతాగి దొడ్డిలో గంతులువేదుతున్నది. అత్తమ్మ వంటయింట్లో కత్తిపీటమీదకూర్చుని ఆలిచిప్పతో పొట్లకాయ గీరుతున్నది. డాబామీలులో పడకకుర్చీలో కూచుని పుల్లయ్యచుట్టకాల్చుకొంటున్నాడు. జగ్గారావు అత్తయ్య కొనిపంపిన బిగులూడుతూ దమదమాలబండి యీడ్చు

కొంటున్నాడు. దొడ్డిలోనుంచి చెంగనాలు తీస్తున్న కోడెదూడ అరుపు పుల్లయ్య చెవినిపడ్డది. "జీతగాడు దూడను కట్టివేయటానికి మరిచిపోయాడల్లే ఉంది బజారునపడితే మళ్ళీ చిక్కదే," అని అతడు ముఖం చిట్లించుకొన్నాడు తాను లేవటానికి బద్ధకించాడు. కుర్చీలోనే కూర్చుని నోటిలోని చుట్ట బయటికితీసి,

"నాన్నా, నాన్నా, నిన్నేరా బాబు పిల్చేది!" అన్నాడు.

"ఏమిటి తాతయ్యా?" జగ్గారావు రెంటచేతులూ పెట్టుకొని ధీమాగా చూచాడు. ఎడమచేతిలో డమడమాలబండి తాడున్నది. కుడిచేతిలో బిగువున్నది. ఆ మెండిమెల, ఆ పిరుదులు, ఆ రొమ్ము, పాలుగారే చెక్కిళ్ళు తాతకు పారవశ్యం కలిగించాయి. గాలికి నల్లని ఉంగరాలజుట్టు కొంచెం కదలుతున్నది.

"బుజ్జాయి పారిపోతున్నది, కట్టివేసి రా నాన్నా!"

"బుజ్జాయినా, కట్టివేయలాదు. నానేమి చేస్తున్నానో కనిపించటంలా!"

తాత నవ్వుకొన్నాడు. "తరువాత బండి తోలుకోద్దువుగాని లే. పోయి కట్టేసిరా."

"తాతయ్యా, నీకు ఏళ్ళు వస్తున్నకొందికీ మతిపోతున్నట్టుంది. బుజ్జాయి తొక్కితే నా నేమవుతాను? ఆ నిక్క లబోదిబో మంటే చూల్లేను."

పుల్లయ్య ముఖంమీది ముడుతలు విరిసినై. ఇంతలోనే లోపలినుంచి కోడలిగొంతు వినిపించింది.

"ఏమండి జగ్గారావుగారు!"

మామూలుగా రంగమ్మ కొడుకును 'బాబూ' అని పిలవటంపరిపాటి. కోపం వస్తేనే పేరుపెట్టి పిలుస్తుంది. ఆమెకు సహనం ఎక్కువ. లక్ష్మమ్మకువలె నోటిచొరవలేదు. నిప్పులాంటి మనిషి. తనవల్ల ఎలాంటి పొరపాటు రానీదు. అందువల్లనే ఆయింట్లో లక్ష్మమ్మ క్రింద నిభాయించ గలిగింది. పుల్లయ్యకు కూడా ఆమెఅంటే ఎంతో గౌరవం. తల్లి పిలుపు వినగానే కుక్కిన పేనువలె బిగులు బండి అక్కడే వదలి లోపలికి వెళ్ళాడు.

"ఎందుకమ్మా!"

"ఇదిగో ఇటు చూడు, ముఖం పైకెత్తవేం! ఇవాళ ఏమి చేశావ్!" రంగమ్మ గదిమింది.

"ఏమి చేశానమ్మా!" పిడికిళ్ళతో కళ్ళు నులుముకుంటూ రాగం ప్రారంభించాడు.

"ఈ బుడిబుడి ఏడుపులు నాదగ్గర సాగవు. నిజం చెప్పకపోతే తిత్తి తీశాన్నే."

చెంపపెట్టు తిన్నవాడివలె కెవ్వుమన్నాడు. సగంలోసిన పొట్లకాయ పట్టుకుని లక్ష్మమ్మ మనుమడి దగ్గరికి వచ్చింది.

"నీకోపం మండిపోను. ఏంచేశావే కెవ్వుమన్నాడు?"

"ఇంకా ఏమన్నా చేస్తే కొంప ఉండేదా? నోరుమూస్ దొంగ వెధవ!" రంగమ్మ దగ్గరోఉన్న చేంతాడు తీసుకొన్నది. గుడ్లురజేసి కొడుకును చూచింది.

"ఏమి చేశాడే?"

"ఏమి చెయ్యాడు! ఇవాళ ఈపని చేసినవాడు రేపుమరొకటి చేస్తాడు. మొక్కైయి వంగనిది మానై వంగుతుందా!"

"నానేమి చేయలేదు నాయనమ్మా."

"ఓరి వెధవ, పెట్టెలో పదిరూపాయలు నోటుతీసి వచ్చిఅబద్ధమాడుతున్నావా?" రంగమ్మ చేంతాడు అవతలపారేసి చేతితో పిర్రమీద ఒకటి చరచింది. జగ్గారావు బావురు మన్నాడు. కుర్చీలో వెల్లకిలగా పండుకొని పుల్లయ్య డాబాకడ్డీలు లెక్కపెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు.

"వాడికి పదిరూపాయలనోటు తెలుసా, పాడా. పెట్టెలో అడుగున ఎక్కడో పడిఉంటుంది చూడు. అయినా తాళంవెయ్యక యేలావూరుకున్నావ్?" అన్నది లక్ష్మమ్మ.

"పిడిబుద్ధి గడ్డితింటుందని కలగన్నానా ఏమిటి? ఆసంగతి తెలిస్తే ఏమిచేయాలో అదే చేసేదాన్ని."

కొరడితో వాతపెట్టినట్లుగా పుల్లయ్య కుర్చీలో ఎగిరిపడ్డాడు. "ఏమి చేశావో నిజంచెప్పు" రంగమ్మ మళ్ళీ ఒకటి చరచింది.

పుల్లయ్యకు ఆదెబ్బ తనవీపుమీదే చరచి నట్లయింది.

"నాను తినట్లేదమ్మా. కావలిస్తే లాగపుల్ని అడుగు!" ఏడుస్తూనే జగ్గారావు చెప్పాడు.

"అన్నం పున్నం యెరగనివాణ్ని కూడా యెందుకులాగుతావు? దేవుడు ఎంతటివాళ్ళనో యెత్తుకుపోతాడు కాని నీకు నాకు చావు లేదురా" మళ్ళీ ఒకటి చరచింది.

పుల్లయ్య రెండుచేతులతో ముఖం కప్పుకొన్నాడు.

"నిజం చెబుతానుగా, అమ్మా కొత్తకే! అమ్మా కొత్తకే! ఒల్లు కందిపోతోంది" బాధతో జగ్గారావు చిందులు తొక్కాడు.

"చెప్పు మరి!" లక్ష్మమ్మ హెచ్చరించింది.

"కోటయ్య కొత్త బతానీలు కొనుక్కున్నాడే. తాతయ్యా తాతయ్యా, చచ్చిపోతున్నా"

"నిజమేనా? ఎప్పుడు తెల్లారింది! ఎప్పుడు బతాణీలు కొన్నావు?" మళ్ళీ తల్లి ఒకటి చరచింది.

"నిజమేనే అమ్మా! పోయి కనుక్కో, వత్తిదేనంటే చంపెయ్" ఎక్కి ఎక్కి ఏడుస్తున్నాడు. ముక్కున చీమిడి కారుతున్నది.

"నేను పోయి కోటయ్యను కనుక్కొస్తాగా! కొట్టకు." పెద్ద ముత్తైదువు లక్ష్మమ్మ రుసరుసలాడుతూ కోమటి కోటయ్య కొట్టుకు బయలుదేరింది. పుల్లయ్య హాల్లో చేతులు వెనక కట్టుకొని అటుయిటూ తిరగసాగాడు.

రంగమ్మ చతికిలబడి ముఖం చేతులతో కప్పుకొని, "అయ్యో భగవంతుడా! ఎంతరాత రాశావురా తండ్రీ. మొగుడుకొరకైనా కొడుకును చూచుకొనే బ్రతుకుదా మనుకొన్నానే. ఈ గుణాల మారి వాడు ఎలా బతుకుతాడే తల్లీ. నా గొంతులో వాడేమి గంజి పోస్తాడే! ఆయన కిచ్చావు గాని చావు నాకివ్వలేదేమిరా భగవంతుడా! వీడితో నేనెట్లా వేగేదిరా! ఈ మాయదారి లోకాన్ని ఎలా సృష్టించావురా నాయనా! గొడ్రాలునైనా యెందుకు చేశావు కావురా. నలుగురిచేత ఊయించుకోటానికి పుట్టాడే. నుయ్యోగొయ్యో చూచుకోక ఇంకా బ్రతికిందుకే!" అని పైనపైనా అంచెట్టి మెల్లగా ఏడుస్తున్నది.

పుల్లయ్య కంపించిపోయాడు. ఆమె దుఃఖానికి తానే కారణమని పించింది. అతనికి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. తన్ను తాను మరచి పోయాడు. చటుక్కున కోడలి దగ్గరికివచ్చి "అమ్మా ! ఏడవకు. తప్పంతా నాది. మళ్ళీ చేయను. ఈ పాదాలు సాక్షిగా చెబుతున్నాను" అని అమాంతం కోడలి కాళ్ళకు సాష్టాంగ ప్రణామం చేశాడు. రంగమ్మ చిత్తగపోయింది. అన్నేండ్ల మామగారు అలా తన కాళ్ళమీద పడేటప్పటికి కొయ్యబారి పోయింది. తనకు తెలియకుండానే యేడుపుమాని చప్పునలేచి రెండడుగులు వెనుకకు వేసింది. కళ్ళు మూసుకుని వగర్పుతో డొక్కలు ఎగరవేస్తున్న జగ్గరావు ఇదంతా చూడలేదు. అతని లోకంలో అతను వున్నాడు.

"మామయ్యా. మామయ్యా !" అని మాత్రమే రంగమ్మ నోటినుంచి వెలువడింది.

ఆపిలుపుతో పుల్లయ్య మామూలు లోకంలో పడ్డాడు. గబగబా లేచివెళ్ళి, హాల్లోని కుర్చీలో కూలబడ్డాడు. రంగమ్మ అలానే నిలబడివుంది. అది స్వప్నమో వాస్తవమో అర్థం కాలేదు. మామగారి ప్రవర్తన అయోమయంగా కనిపించి అలాగే చూస్తూ నిలబడ్డది. చెక్కిలి మీద అంతకు ముందు జారిన కన్నీరు చారలు అలానే ఉన్నాయి.

"కోటయ్యగాడికి ఈ గడ్డమీద ఋణంతీరింది. లేకపోతే అలా ఎందుకు చేస్తాడు?" అంటూ లక్ష్మమ్మ వచ్చింది.

"ఏమిటి అత్తయ్యా! నిజంగా బటానీలు కొన్నాడటనా ?"

"నిజమేనవే! బటానీలియ్యమని పదిరూపాయల కాగితంతెచ్చాడట. మనం పంపించామనుకొని అర్ధణా బటానీలిచ్చి మిగతా చిల్లరయిచ్చి పంపాననీ అంటున్నాడు కోటయ్య కొడుకు. అంతా వట్టిదే. గింజలు నాలుగు చేతిలోవేసి నోటు దాచుకొన్నాడు. వీడీవూళ్ళో ఇంకా ఉంటాడా అంటు! ముసలయ్యఏడి ? ఇంతకుముందు ఇక్కడేఉండెనే! ఎక్కడ పెత్తనాలకు పోయాడు ?"

"ఎందుకు తొందర పడతావు అత్తయ్యా? ముందు నీ మనమడి దగ్గర తెల్సుకోనీ, ఏమిరా—కోటయ్య కొడుకు నీకు డబ్బులిచ్చాడు కదూ?"

"డబ్బులా, బటానీలు కొనుక్కొన్నాగా"

"ఇంకా అనుమానమెందుకే. ఓ ముసలయ్యా, నిన్నే పిల్చేది."

"ఆ," అని పుల్లయ్య మెల్లగా మూలిగినట్లుగా పలికాడు.

"ఇవ్వాళ్ళ పదిరూపాయలైంది. రేపు వేలవుతుంది. లే, లే, కచ్చేరి చావడికి పిలిపించి చెప్పతో కొట్టిస్తే కాని తేలదు. ఇంకా పండుకొన్నావేం లేవక?"

"మామయ్యకు ఒంట్లో సరిగా లేనట్లుంది. ఇంతకుముందే ఇక్కడ దాకా వచ్చి పడిపోయాడు. పోడు డబ్బు, తరువాత చూచుకోవచ్చు. పోయి చూడు అత్తయ్యా!" అన్నది.

లక్ష్మమ్మ కొంచెం ఆతురతతో పాలంలోకివచ్చి చూచింది. భర్త బాగానే ఉన్నట్లు కనిపించాడు. "ఇంకా పీఠం పెట్టుకు కూర్చున్నావేమి, పోయిరాక?"

ఉత్తరీయం వేసుకొని పుల్లయ్య మెల్లగా బయిలుదేరాడు.

"ఇదిగో ఇటుచూడు పుల్లయ్యా!"

అతడు వెనక్కి తిరిగి చూచాడు. ఏమీ కనిపించ లేదు. ప్రక్కకి తిరిగి చూచాడు. ఎవరూ కనిపించలా. ముందుకు చూచాడు. దూరాన ఎద్దు పోతూవుంది. ఎద్దుకు మాటలు ఎలావస్తాయి? మళ్ళీ సాగారాడు. "ఇదిగో నీకే చెప్పేది. కోటయ్య కొడుకు పది రూపాయలు అన్యాయంగా తీసుకున్నాడనేగా కచేరీచావడికి పిలిపించి చెప్పతో కొట్టటానికి సిద్ధమవుతున్నావు? నువ్వుమాత్రం తక్కువచేసింది ఏముంది? చంద్రశేఖరానికై మార్వాడీవద్ద హామీఉన్నమాట అబద్ధమా? నువ్వేచెప్పు! అదివట్టి ఫోర్జరీ అంటున్నావా? నిన్నుచంద్రశేఖరం ఎందుకు చెప్పతో కొట్టగూడదు? అసలు ఊళ్ళో ఎందుకు ఉండనియ్యాలి? నీకుడబ్బుఉంది కాబట్టి నీవేమైనా చెయ్యొచ్చు. కోటయ్యకు డబ్బులేదు. అందుకని చెప్పతో కొడతానంటావా? ఇదేనా న్యాయం? ఇదేనా పెద్దరికం? చెప్పవేం? ఎంతకాలం ఈ ఆటలు సాగుతాయి?"

పుల్లయ్యకు ఈమాటలు కర్ణకఠోరాలయ్యాయి. ఏదోభూతం తిన్న వెన్నాడుతున్నట్లనిపించింది. భయంతో చరచరా ముందుకు పోసాగాడు.

"పుల్లయ్యగారు. పుల్లయ్యగారు!"

అతడు ఒక్కసారిగా కంపించిపోయాడు. ఆ తత్తరపాటుతోనే ప్రక్కకు తిరిగిచూశాడు, ఆసందులోనుంచి నలభైయేళ్ళ కోటయ్య గిరజాల

ముడి జారిపోతుంటే రెండు చేతులతో సవరించుకుంటూ పరిగెత్తుకొని వస్తున్నాడు. గోచి చెంగుజారి పంచె కాళ్ళకు అడ్డుపడుతున్నది. పుల్లయ్య నిలబడ్డాడు.

"బాబూ, పొరపాటయింది. పొద్దున చినబాబు పదిరూపాయల నోటు తెచ్చాడు. కానీ నిబటానీలం పెట్టి తరవాత పంపిద్దామని నోటు తీసుకుని దూవాడు దాచిఉంచాడు. బేరంలో పడి మీనోటు వచ్చియివ్వటానికి జాగు చేశాడు. అంతకుతప్ప మరేమీ లేదు. ఇందులో ఏమన్నా తప్పుఉంటే క్షమించండి. ఇదుగో నోటు!" అని బొడ్లోనుంచి తీసి ఇచ్చాడు.

పుల్లయ్య నోటు పుచ్చుకొని వెనకకు తిరిగాడు. అతను పల్లెత్తు మాట అనలేదు. కోపచిహ్నాలు కూడా అతని ముఖంలో కనిపించలేదు. కోటయ్యకు మాత్రం మరీభయం కలిగింది. కిమ్మనకుండా వెళ్ళిపోయాడు.

# 9

"సత్యనారాయణా! సబ్బు, నీళ్ళు, తుండుగుడ్డ తెప్పించు." వాసుదేవశాస్త్రి రోగి మంచం దగ్గరనుంచి వస్తూ అన్నాడు. వెనక బిళ్ళ గోచి, ముందు వచ్చిళ్ళు వేలాడుతున్నవి. బుష్ షర్టుపై బుజాన స్టెతస్కోపు వేలాడుతున్నది.

"సబ్బు లేదే!" అన్నాడు పంతులు సత్యనారాయణ.

"సున్నిపిండీ, నీళ్ళన్నా తెప్పించు"

సత్యనారాయణ పెద్దకొడుకు సున్నిపిండి, నీళ్ళు, తుండుగుడ్డ తీసుకు వచ్చాడు. శాస్త్రి చేతులు కడుక్కొని తుడుచుకున్నాడు. కుర్రవాడు లోపలికి వెళ్ళిపోయాడు.

"అదృష్టవంతుడివి, ఆదాలో పడబోతున్నావులే," అని నవ్వుతూ శాస్త్రి వీధిఅరుగుమీద పరచివున్న చాపమీద చతికిల బడ్డాడు.

"ఆదా ఏమిటి?" పంతులు తెల్లబోయి అడిగాడు. శాస్త్రి అంతర్యం అతనికి తెలియక కాదు. ఆ విషయం స్వయంగా ఊహించటం ఇష్టం లేదు.

"గింజ కరువుకదా. ఇక వెనకబడతాయిలే" శాస్త్రి వివరించాడు.

ప్రాణాలతో పరిహాస మాడుతున్నాడని కోపంవచ్చింది. తన లేమి వల్లనేగదా ఆమాట స్నేహితుడై ఉండికూడా అనగలిగాడని పంతులుకు తనమీద తనకే అసహ్యం గలిగింది.

"మీ శాస్త్రం కేవలం ఆదా మార్గాలే చెబుతుందా?" వీధి రెండవ అరుగు పక్కన నిలబడి పంతులు అడిగాడు.

"పిచ్చివాడా! ఎందుకు అంతకోపం? అటు కూర్చో చెబుతా"

పంతులు అరుగుమీద కూర్చున్నాడు. శాస్త్రి మళ్ళీ అందుకొన్నాడు:

"మీ నాన్నకు ఎన్నేళ్ళు - ఎనభైదాటలా! ఇప్పుడు మందేమి పనిచేస్తుందంటా. ఇంతవరకూ చావు తప్పించుకొన్న వారెవరూ లేరు. ముందేమన్నా తప్పించుకొంటారేమో తెలియదు. డబ్బు కరిగించి పోస్తే ఇంకా నాలుగునాళ్ళు బ్రతికించవచ్చునేమో. నీదగ్గరా డబ్బులేకపోయె. ఆ ముసలాయన మాత్రం ఇంకా సాధించవలసిం దేమున్నది?"

"అయితే రోగిని చూడటానికి ఎందుకు వచ్చారు?"

"అదే నేనూ ఆలోచిస్తున్నది. అసలు వద్దామనుకోలేదు. మానివేదామనే. కాని పాడుడాక్టరుబుద్ధి వూరుకోనిచ్చింది కాదు. రోగికిలాగానే అతనికి కూడా ప్రాణాన్ని ఎలాగైనా నిలబెట్టాలనే ఉంటుంది. చివరి దాకా పోరాడుతూనే ఉంటాడు. అతని శాస్త్రం, ఊరుకోనీదు. అది అలాఉంచు. మీనాన్నగారికి క్షయ. పిల్లా జెల్లను అట్టేదగ్గరకు పోనీకు. ఆయన కోరినవన్నీ పెట్టించు. ఇంజక్షన్లు వగైరాలు నీవు భరించలేవు. ఈసీసాలో మాత్రలు నాలుగుగంటల కొకసారి నాలుగేసి చొప్పున చేత్తో ముట్టుకోనక కాగితములోవేసి యిస్తూ ఉండు. పంచదార మాత్రలని పిల్లలు తింటారేమో జాగ్రత్త!"

డ్రాము సీసా ఒకటి సంచిలోనుంచి తీసి యిచ్చాడు. సత్యనారాయణ ఆ సీసా యింట్లోపెట్టి బయటికి వచ్చాడు. శాస్త్రి సంచి పట్టుకొని బయలు దేరాడు. వద్దన్నకొద్దీ పంతులు అతనివెంట బయలు దేరాడు. దారిలో ఎవరూ మాట్లాడలేదు. కటిక చీకటి. రోడ్డు—పేరుకు కంకరరోడ్డే గాని అన్నీ గుంటలే. అన్నీ గోతులే. కత్తెరరాళ్ళు నిక్కబొడుచుకొని ఉన్నాయి. ఆ రోడ్లన్నీ బాగా అలవాటైనవి కాబట్టి ఎదురుదెబ్బలూ తప్పించుకొని పోతున్నారు. ఎవరూ మాట్లాడలేదు.

వాసుదేవశాస్త్రి చాలవిచిత్రవ్యక్తి. నైష్ఠిక కుటుంబంలో పుట్టాడు. తల్లిదండ్రులకు కూతురైనా కొడుకైనా అతడు ఒక్కడే. ఎంతో గారాబముగా పెంచారు. అతడు ఆడిందిఆట, పాడింది పాట అయింది. తండ్రికి అంతగా ఇష్టం లేకపోయినా ఇంగ్లీషు చదువు చదువుకున్నాడు. బి. ఎ. పూర్తి చేసి తండ్రి వద్దని బ్రతిమాలినా ఉన్నది కాస్తా ఊడ్చి యం. బి. బి. యస్. పూర్తిచేశాడు. భార్య కాపరానికి వచ్చింది. ప్రాక్టీసు పెట్టటానికి డబ్బు లేదు. కావాలంటే మామగారు సాయం చేసేవారే. కాని ఒకరిని పోయి అడగటం అతనికి ఇష్టంలేదు. అసలు విషయం అది కాదు. వైద్య సౌకర్యం లేక అవస్థపడుతున్న పేదప్రజలకు తోడ్పడాలని మొదటినుంచి ఉండేది. ఇప్పుడు అవకాశం లభించింది, ఎందుకు సాధించగూడదన్న భావంకలిగింది.

అతడు గ్రామంలో పుట్టి గ్రామంలో పెరిగాడు. గ్రామంలోని ఆస్తి పాస్తులను అమ్మి అతడు విద్యావంతు డయ్యాడు. కాబట్టి అతని నుండి కొంత సేవ కోరటానికి ఆ గ్రామానికి అధికారం ఉన్నట్లుగా భావించాడు. అందువల్ల కొద్దిమందులతోనే స్వగ్రామం చేరాడు. గ్రామీలకు సహజంగా ఉండే అనుమానంతోనే అతని స్వగ్రామం కూడా చూడ మొదలుపెట్టింది. నిజంగా ఇతగాడు యం.బి.బి.యస్. చదివితే పల్లెటూళ్లో ఎందుకుంటాడు? ఏబస్తీలోనో ప్రాక్టీసు పెట్టుకుంటే ఎడా పెడా సంపాయించవచ్చునే! ఏదో మర్మం ఉండాలని నిశ్చయించింది. అందువల్ల కాస్త ఉన్నవాళ్ళెవరూ అతనివద్దకు మందుకు వెళ్ళేవారు కారు.

అతడు ఊళ్ళో ప్రాక్టీసు పెట్టిన రెండునెలలకు ఆచారిగారికి పరమ రహస్యం తెలిసిపోయింది. వాసుదేవశాస్త్రి మెడికల్ కాలేజీలో చేరిన మాట వాస్తవమే కాని తోటివిద్యార్థినితో అక్రమంగా వ్యవహరించటం వల్ల మొదటి సంవత్సంలోనే డిబార్ చేశారట. అయిదేళ్ళు అతడు అక్కడ ఊరేగి వచ్చాడట. అంతేకాని వైద్యంగీద్యం ఏమీచదువలేదట. ఈవార్తను సత్యవ్రతులు శాస్త్రి చెవినివేశారు. అతడు కోపగించుకోలేదు. 'ఏమయ్యా ఇలాఅన్నావటగా' అని ఆచారిగారిని అడగలేదు. తన డిగ్రీని యెవరివద్ద చూపించలేదు.

ఊళ్ళలో సాధారణంగా కూలివాడి దగ్గరనుంచి షావుకారుదాక ఒక పరిపాటి ఉంది. కాస్త లేచి తిరుగుతూఉంటే అది జబ్బుకింద పరిగణించరు. ప్రాణం గొంతులో గుటగుటలాడుతుంటేనో, లేగి బాధపడలేక

పెడబొబ్బలు పెడుతుంటేనో రోగమున్నట్లు. లేదా కనీసం ఇరవైరోజులైనా పడకవెయ్యాలి. రోగమున్నప్పుడు ఆ నిదానమన్నా కనిపించాలి. ఈ చెప్పిన నిదానాలు కనిపించకపోతే వ్యాధికింద జమకట్టటానికి వీలులేదు. అందువల్ల బాగా ఉన్నవాళ్ళు బస్తీకి వెళ్లుతారు. లేనివాళ్ళు ఆచారిగారివద్దకు వస్తారు.

మొట్టమొదటి నాలుగు నెలలలో శాస్త్రికి కేసంటూ లేదు. కాకపోతే అన్నిచోట్లు తిరిగి, అన్నిమందులు తిని, నోరు కాయకాచి ఆశ వదలుకొన్న రోగులు ఒకరిద్దరు వచ్చారు. ఎక్కడా నయంకాని రోగాలు అతని వద్ద మాత్రం ఏమి నయమౌతాయి? అతడు ధన్వంతరి కాదు. స్పష్టంగా చెప్పివేశాడు ఉన్నదేదో. అది కొంత సదభిప్రాయం కలిగించింది. ఇలా ఉండగా ఒక సంఘటన జరిగింది. మల్లయ్యగారి పినతల్లికి బ్రెస్టు కాన్సర్ వచ్చింది. బస్తీకి తీసికెళ్ళితే మొదటిసారి శస్త్రచికిత్స చేశారు. కాని దోషం ఎక్కడో కొంతమిగిలి మళ్ళీ నాలుగేళ్లకు పెద్దనారింజకాయంత ప్రమాణమై కూర్చున్నది. వెనక శస్త్రచికిత్స చేసిన డాక్టర్ వద్దకే తీసుకు వెళ్ళితే 'లాభంలేదు. పట్టణం తీసుకువెళ్ళం'డని సలహాయిచ్చాడు. పట్టణం పోయినా ప్రయోజనం ఉండదని ఇంటికి తీసుకు వచ్చారు. ఒకరోజున ఆచారిగారు ఏదో పనిమీద వెళ్లి ఆ రోగిని చూచాడు. "ఈమాత్రం భాగ్యానికి పట్టణం తీసుకువెళ్ళాలా? పదిహేనురోజుల్లో మటుమాయం చేస్తాను చూడండి. డాక్టర్లని పేరేగాని వాళ్ళకు వైద్యం ఏమి తెలుసునంట!" అన్నాడు. ఆమె ఆశపడ్డది. చికిత్స ప్రారంభించమన్నది. ఆచారిగారి పట్టీలుపడ్డ మూడోరోజుకల్లా మంటలు, పోట్లు. బాధపడలేక శాస్త్రిగారిని పిలిపించి చూపమని ప్రాధేయపడ్డది.

శాస్త్రివస్తే ఆచారిగారికి కోపం. రాకపోతే మల్లయ్యగారికి కోపం. బాధ అనేది రోగికి లేకుండా ఉన్నట్లయితే పోయి ఉండేవాడు కాదేమో! కాని అవతల పడుతున్న నరకబాధనుగూర్చి వినలేక నేరుగా బయలుదేరి రోగిని చూచాడు. బ్రెస్టుకాన్సరు. పాషాణపుపట్టి వేసిఉన్నది. చర్మంమాత్రం చిట్లింది. వెంటనే ఆపట్టీలు తీసివేసి గాయాన్ని మందునీళ్ళతో కడిగి ఉపశాంతికి మందేదో ఇచ్చాడు, "వెంటనే పట్టణం తీసుకు వెళ్ళండి. అదృష్టముంటే బ్రతుకుతుంది లేకపోతే లేదు" అని

ఖండితంగా చెప్పివేశాడు. రోగి అవస్థచూచి సహించలేక శాస్త్రి గబగబా ఆచారిదగ్గరకు వెళ్ళాడు. ఆచారికి అర్థంకాక కళ్ళు అప్పగించిచూస్తున్నాడు

"రోగిని చూచావా? ఆకళితేమిటో ఎందువల్లవచ్చిందో అర్థం చేసుకొన్నావా? పుసపుస పాషాణంవేస్తే అయిపోయిందనుకున్నావా? ఎక్కడ నేర్చుకొన్నావయ్యా ఈవైద్యం?" అని శాస్త్రి జాడింపుకు అందుకున్నాడు.

"ఓహో, నీకు వైద్యంకూడా తెలుసే!"

"నాకు వైద్యం వచ్చోరాదో ఇప్పుడు దేనికి? రేపుకోర్టులోమల్లయ్య గారు కేసుపెట్టినప్పుడు తమ వైద్యవైశారద్యం ఏమిటో చూపింతురుగాని" శాస్త్రి ఆగకుండా చర్రున ఇంటికివెళ్ళాడు.

అతడుపోయిన అరగంటకు ఆచారిగారికి ఆవేశం దిగజారి మామూలు లోకంలోపడ్డాడు. మల్లయ్యగారు కేసుపెడితే తనగతి ఏమవుతుంది? అందుకు ఆయన సమర్థుడుకూడా. మల్లయ్యగారితో శత్రుత్వమేకాక ఊళ్ళోఉన్న కాస్త పేరుపోతుంది. గడగడ వణకిపోయాడు. ఆరాత్రి మల్లయ్యగారి కాళ్ళువేళ్ళు పట్టుకుని కేసుపెట్టనని అతనిచేత చేతిలోచేయి వేయించుకొనివచ్చాడు. శాస్త్రి కేసుపెడతాడేమో, చూస్తూచూస్తూ అతన్ని ఎలా ప్రతిమాలుకొంటాడు? ప్రతిమాలుకొన్నా తాను చేసిన అపకారానికి ఊరుకుంటాడా? ఆ మరునాడే బస్తీకివెళ్ళి ప్లీడర్నికనుక్కుంటే కేసు పెట్టవచ్చుననీ, జరిమానా పడవచ్చుననీ తేలింది. గత్యంతరంలేక ఆరాత్రి చీకటి మాటునవెళ్ళి శాస్త్రి కాళ్ళమీదపడ్డాడు. తెలిసీ తెలియనివైద్యం చేస్తే మర్యాద దక్కదని శాస్త్రి హెచ్చరించి పంపాడు.

ఈ సంగతి క్రమంగా మల్లయ్యగారిద్వారా పాక్కింది. అప్పటి నుంచి శాస్త్రికి ప్రాక్టీసు పెరిగింది. దీనికితోడు గడ్డుకేసులు నాలుగైదు నయం చేశాడు. దానితో ఊరంతకు ఆయన యం. బి., బి. యస్. అని తెలిసింది. అయితే అతనికి డబ్బు ప్రధానం కాదు. అందు వలన ఉన్నవాళ్ళ దగ్గర ఉన్నట్టుగా తీసుకొని పేదసాదలకు కొంత తోడ్పడుతూ వచ్చాడు. తమవద్ద ఎక్కువ తీసుకుంటున్నాడని కంటుగావున్నా మరొకరు లేక పోవటంవల్ల అతని దగ్గరకు వెళ్ళక తప్పలా.

కాస్త దారిలోపడ్డాననుకొంటూ ఉండే శాస్త్రికి ఆకస్మికంగా భార్య చనిపోయింది.

తరువాత ఎంతోమంది తమ పిల్లలను ఇస్తామని వచ్చారు. ముసలితనంలో ఉన్న తండ్రి, “చేతులు కాళ్ళ్వగో లేవురా మళ్ళీ పెళ్ళి చేసుకో” మని బ్రతిమాలాడు. “ఈ పండు ముసలితనంలో నాకు దిక్కు లేకుండా చేస్తావా” అని నిష్ఠురాలు ఆడాడు. కాని లాభం లేకపోయింది. శాస్త్రి ఉద్దేశం ఎవరికీ తెలియదు. చివరికి తండ్రి ఆ దిగులుతోనే చచ్చిపోయాడని, ఊళ్ళోవాళ్ళు అంటారు. కాదు గుండె జబ్బువల్ల చచ్చిపోయాడని శాస్త్రి చెబుతాడు.

ఇంతలో 1942 ఉద్యమం వచ్చింది. శాస్త్రి ఏమీ చేయకపోయినా ప్రభుత్వం డిటెన్యూగా పట్టుకు వెళ్ళింది. అక్కడ ఉండగా ఎలాంటి రాజకీయానుభవాలు కలిగినవో చెప్పలేము కాని అతని దృష్టిలో మాత్రం విపరీతమైన మార్పు వచ్చింది. కారాగారవాసమే ఆ పరిణామం కలిగించిందో, అప్పటి సహచరుల ప్రవర్తనతోనే విరక్తి కలిగిందో, చదివిన పుస్తకాలే అలా చేశాయో తెలియదు. అక్కడ ఏ పుస్తకాలు చదివాడో తెలియదు కాని, హోమియో చదివిఉండాలి. లేకపోతే జైలునుంచి వచ్చీరావడంతోనే పంచదార మాత్రలు ఇస్తున్నాడు.

ఇప్పటికి వీలైనంతవరకు హోమియో పద్ధతే అనుసరిస్తున్నాడు. కాని ఇదివరకున్న జాతీయ ఆవేశం, జాతీయ భావాలు లేవు. అధికారం, లాభం దక్కకపోవటం కారణం కాదు. యం. యల్. ఏ గా నిలబడమని పార్టీ పెద్దలు స్వయంగావచ్చి హెచ్చరించారు. అతడు నిరాకరించాడు. రాజకీయ బాధిత సహాయక సభ్యులంతా అతనికి తెలిసినవాళ్ళే. నిజానికి అర్జీ పెట్టమని ఎంతో బలవంత పెట్టారు. “నాకు దేనికి? పిల్లలా జెల్లలా? జానెడుపొట్ట, కావాలంటే మందులసంచి ఉండనే ఉన్నది” అని శాస్త్రి నవ్వాడు.

శాస్త్రి సత్యనారాయణతో కలిసి యింటికి వచ్చేటప్పటికి అరుగు మీద ఎవరో కూర్చున్నారు. చీకట్లో ముఖం కనిపించక ‘ఎవరది?’ అని అడిగాడు.

“నేనండీ డాక్టరుగారు!”

“నేనంటే” డాక్టరు తలుపుతీస్తూ అడిగాడు.

"మల్లయ్యగారి అబ్బాయిని. మా నాన్నగారు మందుకు పంపిస్తే వచ్చాను."

"లోపలికి వచ్చి ఆ కుర్చీలో కూర్చో. సత్యనారాయణ మందుఇచ్చి ఇప్పుడే వస్తాను."

సత్యనారాయణహాల్లో కూర్చున్నాడు. కుర్రవాడితో పక్క గది లోనికి వెళ్ళుతూ "ఏమిటిరా జబ్బు?" అని డాక్టరు అడిగాడు. అన్ని మాటలూ పంతులుకి వినిపిస్తూనే ఉన్నాయి.

"ఏమిలేదు. ఒళ్ళు తిమ్మిరి తిమ్మిరిగా ఉన్నదంట."

"అదేమిటిరా, నీకా మీ నాన్నకా?" డాక్టరు నవ్వాడు.

"అదికాదండి, పులకపులకగా ఉన్నదంట, ఆమాట అనబోయి తిమ్మిరి అన్నానులెండి. తలగొడ్డళ్ళతో పగలేసినట్టుగా ఉన్నదంట."

శాస్త్రి మందుకలుపుతూనే "సీసా తెచ్చుకున్నావా?" అని అడిగాడు.

గంగాధరం లాగు రెండు జేబులూ తడువుకున్నాడు. "అవ్, అవ్, పోయింది. దానికైనా బుద్ధిలేదు. ఏమిచేసేది? సరేకాని డాక్టరుగారూ, ఏదైనా సీసా ఉంటే యివ్వండి. రేపు పొద్దున్నే తీసుకొస్తాను."

"ఇట్లా ఎన్ని సీసాలైయాయో?"

"ఏమండోయ్ డాక్టరు గారు, ఇటుచూడండి! నేనెప్పుడైనా సీసా తెస్తానని చెప్పి తేకుండా మానేశానా?"

"నువ్వు కాదులే. కాని..."

"ఎవడో బుద్ధితక్కువవాడు చేసిఉంటాడు. అంతా అలాంటివాళ్ళ యితే మీరేమి మందు లిస్తారు? మేమేమి తీసుకెళ్ళుతాము!"

డాక్టరు ఖాళీసీసా ఒకటి చూచి మందుపోసి యిస్తూ "ఈ పూట సగం, రేపు పొద్దున సగం తాగమను. ఎలావున్నదీ రేపు సాయంత్రాలు వచ్చి చెబుతావుగా?"

"అయితే యీమందు దేనికి? పారబోస్తా!"

"ఓరి పిడుగా మందు పారబోస్తానంటావేమిరా?"

"రేపు సాయంకాలం వచ్చి ఎలా ఉన్నది వచ్చి చెప్పమంటున్నా రంటే నయం కాదనేగా. నయంకాని మందు దేనికి డాక్టరుగారూ?"

"నువ్వు రావద్దు. మీ నాన్నే వస్తాడులే చెప్పు."

గంగాధరం ఒక్క అడుగువేసి ఆగాడు. మళ్ళీ వెళ్ళబోయి డాక్టరువైపు చూచాడు.

"ఏమిటిరా? ఇంట్లో ఇంకా ఎవరికన్నా మందు కావాలా ఏమిటి?"

"ఇదిగో డాక్టరుగారు, పిసినిగొట్టుతనంకూడా పోవటానికి ఏమన్నా ఉంటే ఇందులోనే కాస్త కలిపి యివ్వండి పుణ్యముంటుంది."

శాస్త్రికి అర్థం కాలేదు. తన వైద్యాన్నే వెక్కిరిస్తున్నాడో, అమాయకంగా అడుగుతున్నాడో బోధపడలేదు. కోపం తెచ్చుకుని "ఇవాళ ఇదన్నావు. రేపొద్దున్న విషం కలపమంటావు. ఉండు చెబుతాను మీ నాన్నకి."

"ఎందుకండి కోపం! మొన్న స్కూల్లో మీరే కదా చెప్పింది, శరీరం బాగుంటేనే మనసు బాగుండేదని. లాగులూ చొక్కాలూ చిరిగి పోయినవి కుట్టించు మంటే వినడు. మీరే చూడండి - సీసా లాగుజేబులో వేసుకొస్తే దారిలో ఎక్కడో పోయింది. లాగు సరిగా ఉంటే సీసాపోయి ఉండేది కాదుగదండీ. ఇది ఒక్కటంటే ఒక్కటే కాదు. కడుపార తాను తినడు, మమ్మల్ని తిననీడు. ఒంట్లో సరిగ్గావుంటే ఇలాంటి బుద్ధి వస్తుం దంటాగా మీరే చెప్పండి,"

లాగు చినుగులు, గంగాధరం ముఖం చూచిన తరువాత డాక్టరు నవ్వకుండా ఉండలేక పోయాడు. "అది పెద్దజబ్బు. నింపాది మీద కాని నయంకాదులే. చీకట్లో పోగలవా? ఎవరినన్నా పంపించేదా?" అన్నాడు. "నాకేంభయంలేదు లెండి" చీకట్లో యింటికి వెళ్ళాడు.

శాస్త్రి హాల్లోకివచ్చి "అంతా వింటున్నావా?" అని సత్యనారాయణను అడిగాడు. "వినకేం, వాడన్నదాంట్లో అబద్ధం నాకెక్కడా కనిపించలేదు" అన్నాడు. శాస్త్రి నిట్టూర్చి "వాడిలో నీకేమి కనిపించింది?" అన్నాడు.

"అమాయకత్వం."

"అంతేనా? వాడు పెద్దవాళ్ళు చెబుతున్నారని వినడు. వాడికి తోచాలి. సహేతుకంగా కనిపించాలి. అనుభవానికి తగలాలి. అంత[illegible]

నూరుచెప్పు, వెయ్యిచెప్పు నమ్మడు. వాడికి సహేతుకంగా కనిపించిందో ఆమాట పాటిస్తాడు. చెప్పినవాళ్ళను గౌరవిస్తాడు. వాళ్ళ నాన్న చెప్పే దానిమీద కించిత్తుకూడా నమ్మకంలేదు. అందువల్ల ఆయనమీద గౌరవం లేదు. నేను వాడిని ఏమిచేశాను? పెట్టి పోషిస్తున్నానా? కష్టసుఖాలకు ఆదుకొంటున్నానా? ఏమీ లేదు. నామీద వాడికున్న గురి, గౌరవం, భక్తి వాళ్ళతండ్రిమీద లేవు."

"నిజమే! కనిపిస్తూనే ఉంది."

"వాడే కాదు. సాధారణంగా మానవతత్త్వమే అలాంటిది. గుడ్డిగా నమ్మమంటే, బుద్ధిమంతులు చెప్పారు వినమంటే వినడు. హేతువు అడుగుతాడు. సమంజసత్వం విచారిస్తాడు. అనుభవాన్ని పురస్కరించుకొని పరీక్షిస్తాడు. వీటన్నిటికీ నిలచిన దాన్ని గౌరవిస్తాడు. అనుసరించటానికి ప్రయత్నిస్తాడు. అందువల్ల భక్తివిశ్వాసాలు లేవని, ఈయుగాన్ని యిప్పటి సమాజాన్ని నిందించి లాభంలేదు. నేను గొప్పవాణ్ని మా సంప్రదాయాలు గొప్పవి అంటే ప్రయోజనం లేదు. నీగొప్ప ఎక్కడుందో, మీ సంప్రదాయాల విశిష్టత ఏమిటో చూపాలి. ఉపపత్తుల చూపి ఆచరణలో సాధించాలి. అలా కానినాడు మానవుడు ఆగొప్పను, విశిష్టతను త్రోసివేస్తాడు. త్రోసి వేయకపోతే వాడు మానవుడే కాదు.

"ఈనాడు మనసమాజంలో జరుగుతున్న సంఘర్షణ ఇది. శ్రుతిస్మృతి అర్థాలను ప్రశ్నిస్తున్నాడు. అదేమి న్యాయమని అడుగుతున్నాడు. అది యీనాటి పరిస్థితులలో పనికిరాదు అంటున్నాడు. కొత్తవి సృష్టించుకోవాలి అని ఆందోళనపడుతున్నాడు. ఒకపక్షం ఇలావాదిస్తూఉంటే మరొకపక్షం దేశం, జాతి, ప్రజానీకం అంటూ ఆవేశం ఎక్కిస్తున్నది. వ్యక్తిసముదాయాన్ని మించి జాతి, ప్రజానీకం, సమాజం, ఎక్కడున్నదో తెలియదు. అధిక సంఖ్యాకులకు శ్రేయస్కరమైనదే ధర్మం, వారికి ఉపయోగిస్తేనే శాస్త్రం, వారికి ఆనందమిస్తేనే కళ అని అంటున్నారు. ధర్మమేదో శాస్త్రమేదో, కళఏదో నాకు నేను నీకు నీవు చెప్పుకోటానికి వీలులేదు. అధిక సంఖ్యాకులు ఏమనుకుంటున్నారో దానినిబట్టి చెప్పుకోవాలి. ఈతత్వంతో శివాలు ఎక్కిస్తున్నారు. ప్రజలు వివేకం ఉన్నది విచారించుకొందామని మరచిపోయి శరభ దశ్శరభలు కొడుతున్నాడు.

"ఈ పరిస్థితులలో మనవంటి అల్పసంఖ్యాకులకు రెండే మార్గాలు వున్నాయి. మనవ్యక్తిత్వం పూర్తిగా విడిచిపెట్టి అధిక సంఖ్యాకులలో లీనమైపోవాలి. వీళ్ళు చెప్పింది వేదవాక్కుగా ఒప్పుకోవాలి. ఆడిందిఆట పాడింది పాటగా ఆనందించాలి లేదా సంకుచితస్వార్థాన్ని అధిగమించి సర్వమానవ కోటికీ–అంటే ప్రతిఒక్క మానవునికీ శ్రేయస్కరమైన ధర్మమార్గాన్ని చూపించగలగాలి. ఆమార్గం సహేతుకం, సమంజసం, ఆచరణ సాధ్యమని నిరూపించి నిత్యజీవితంలో నడిచి చూపించాలి. అందరికీ దీనిని అందుబాటులోకి తేవాలి. ఆనాడు బుద్ధుని సిద్ధాంతాలు ఆసేతు హిమాచలమే కాక, ఖండఖండాంతరాలలో వ్యాపించినవంటే ఇదే కారణం. నేడు అలాంటి గురుతరబాధ్యతే వివేకవంతులమీద ఆధారపడివుంది. ఈ రెండూ జరగక పోతే మనం నామరూపాలు లేకుండా నాశనమైపోతాము. ఇవీ ఇప్పటి పరిస్థితులు.

"అన్నట్టు ఈ ప్రస్తావన ఎందుకువచ్చింది? కారణమే కనిపించటం లేదు. కాని ఏదో ఉండిఉండాలి. పాడు మనస్సు కోతిలాగా యీకొమ్మ నుంచి ఆకొమ్మకు, ఆకొమ్మకు దూకుతూ ఉంటుంది."

ప్రొద్దుపోయింది వస్తానని సత్యనారాయణ లేచివెళ్ళాడు. శాస్త్రి అతన్ని రోడ్డువరకూ సాగనంపివచ్చి, ఆలోచిస్తూ కూర్చున్నాడు.

సత్యనారాయణ తనవెంట ఎందుకువచ్చాడు? తండ్రివిషయం మాట్లాడవలసినది ఏమున్నది? చెప్పవలసినదేదో అతని ఇంటివద్దనే చెప్పాడు. ఏదో చెప్పదలచే ఇంతదూరంవచ్చాడు. తనతో ఏమి మాట్లాడదలచాడు? పుల్లయ్య చంద్రశేఖరం వ్యవహారమేమైనా చెప్పదలచాడా? అతనికి తెలియటానికి అవకాశమున్నదా? పుల్లయ్య లెక్కల వ్యవహారమంతా అతడేకదా చూస్తున్నది. అయినా ఇలాంటివ్యవహారం సత్యనారాయణకు చెప్పి ఉంటాడని నమ్మకమేమిటి? ఒకవేళ ఆవ్యవహారమే మాట్లాడటానికివచ్చి ఉండవచ్చు. కాని తరువాత మనసుమార్చుకొని ఉండవచ్చును. నాసలహా అతనికి కష్టంకలిగించి ఉంటుందా? కష్టంకలగటానికి అవసరమేమీ కనిపించటమూలేదు. ఇష్టముంటే అనుసరిస్తాడు. లేకపోతే మానివేస్తాడు.

అసలు పుల్లయ్య చంద్రశేఖరాలకు తగాదా ఎందుకువచ్చినట్లు? ఇందులో ఎవరిదితప్పు? పుల్లయ్య మాటతప్పి వాదనటానికి మనస్కరింప

టము లేదు. డబ్బుపోతుందన్న తహతహలవల్ల, అబద్ధాలకు దిగుతున్నాడా? కాక శేఖరమే దురాగతానికి ఒడిగట్టాడా? సత్యం ఎలా తెలుస్తుంది వాళ్ళకు తప్ప? ఇద్దరూ కోర్టుకు యెక్కుతున్నారు. సాక్ష్యంకోసం గ్రామం మరీ అల్లకల్లోలమైపోతుంది. కక్షలు రేగుతాయి. అర్థమూ పర్థమూ తెలియని వాళ్లు బలియైపోయేవరకూ వస్తుందో ఏమో !

ఆపదలోఉండే కాకి ఒకటి అరిస్తేనన్న పది కాకులు చేరతాయి. మానవుడు అలా కాడు. కష్టసుఖాలు పైనుంచివచ్చి పడ్డవి కావు. అంతః కలహాలకు గురియై చేతులార తెచ్చుకుంటున్నారు. పశుపక్ష్యాదులలో కనిపించే మైత్రిఅన్నా వీళ్ళకు యెందుకు ఉండదు ? ఈ కలహాలు, కక్షలు యెందుకు వస్తున్నవి? సహకారం, సహనం, సానుభూతి, సామరస్యం యెందుకు కొరవడుతున్నవి ? ఇవి లోపించిననాడు మానవత్వం మాత్రం ఉంటుందా ? ఉండనీ ఉండకపోనీ తనకు ఈ సంగతి దేనికి ? ఈ భావాలతో తాను ఒక దేవుణ్ణి సృష్టించటం లేదా ? ఒకసారి పుట్టిన తరువాత ఈ దేవుడు ఊరుకుంటాడా? భక్తబృందాన్ని తయారు చేస్తాడు. దీన్ని పాపుల మీదకి పంపకం చేస్తాడు. ఈ ధర్మాధర్మ వాతావరణ ప్రబోధం దేనికి ? ప్రతి వాళ్ళకు ఆలోచించుకునే శక్తి లేదా ? తాను వాళ్ళకన్న గొప్పవాడా? ఆ అహంకారం లేకపోతే ఈ సమస్యలన్నీ తన నెత్తిన ఎందుకు వేసుకోవాలి ? తనకు ఉత్తమమని తోచిందీ, తన అంతఃకరణం ఆదేశించినదీ చేస్తే సరిపోతుంది. అంతకు వినా ఉత్తమమైనది మరొకటి కనపడటం లేదు.

ఆ రాత్రి మక్కూరులోని వంటకాలు అలాగే ఉండిపోయాయి.

## 10

పంతులు తన యింటిపద్దకు వచ్చేటప్పటికి వాకిటిముందు తారట్లాడుతూ ఎవరో వ్యక్తి కనిపించాడు. చీకట్లో గుర్తు పటలేక ఎవరా అని నిదానంగా పరిశీలిస్తూ నిలబడ్డాడు.

"పంతులు గారూ?"

"ఆఁ. ఎవరది?"

"నేనే... చంద్రశేఖరాన్ని."

"మీరా? రండి. ఎంతసేపయింది వచ్చి?"

"ఒక అరగంట అయివుంటుంది. కాస్త బయటికి వెళ్లుదాము వస్తారా?"

సత్యనారాయణకు అతడు బయటికి ఎందుకు రమ్మంటున్నాడో అర్థమయింది. చీకట్లో అతనివెంట వెళ్ళటం మంచిదా? ఒకవేళ పుల్లయ్య తమ యిద్దర్నీ చూస్తే ఏమనుకుంటాడు! పుల్లయ్య కాదు మరొకవ్యక్తి అయినా అనుమానించక తప్పదు. అసలు అనుమానించవలసిన అవసర మేమున్నది? తాను అపమార్గం అనుసరిస్తేకదా? ఇంతవరకూ తాను అలాంటి పని ఏమీ చేయలేదు. చేయాలన్న ఉద్దేశమూ లేదు. అయినప్పుడు తానెం దుకు భయపడాలి? ఇతరులకు భయపడుతూ ఎంతకాలం బ్రతుకుతాడు? పుల్లయ్య చూచి తనపై కత్తిగడితే? తాను తన కుటుంబం ఏమౌతుంది? ఇప్పుడుమాత్రం తమ్మి ఊరకపెట్టి పోషిస్తున్నాడా? ఈ చాకిరి మరొక చోట చేస్తే పొట్ట గడవకపోయిందా!

సత్యనారాయణ చంద్రశేఖరం వెంట ఆ చీకట్లోనే నడుస్తున్నాడు. ఊరి బయటికి వచ్చారు. అతనికి జంకు కలిగింది.

శేఖరంగారు దురుద్దేశంతో తన్ను ఊరిబయటికి తీసుకవస్తున్నా డేమో? తన్ను చంపితే అతనికి వచ్చే ప్రయోజన మేమిటి? బ్రతికి ఉంటేనే అతనికి ఏమైనా ప్రయోజనం కలగవచ్చును. ప్రతిపని ప్రయోజనాపేక్షతో జరుగుతున్నదా? మొన్న చదువుకుంటున్న కుర్రాణ్ని చంపి ఊరిబయటి బావిలో ఎందుకు పడేశారు? సరిగా విచారణ జరిగిన పాపానకూడా పోలేదు. తనకూ అదే జరిగితే? పిరికితనం అలా అనిపిస్తున్నది అంతే.

కాలవ వంతెనమీద శేఖరం కూర్చున్నాడు. సత్యనారాయణ అతని ప్రక్కనే చేరాడు.

"పంతులుగారూ! మీకు అన్నీ తెలుసు. ఒకరిచేత చెప్పించుకొనే వాళ్ళు కాదు. అయినా నా ఆందోళనకొందికి తీసుకవచ్చాను. అన్యా యంగా నాకు తోడ్పడాలని కోరటం లేదు. నాదే అన్యాయమైతే మిమ్మల్ని చూడటానికికూడా ధైర్యం వుండేది కాదు. కేవలం ధర్మం చెప్పం డని గుర్తు చేయటానికి తీసుకవచ్చాను."

శేఖరం సత్యనారాయణవైపు చూచాడు. అతడు మాట్లాడలేదు.

"ఏమంటారు?" శేఖరం హెచ్చరించాడు.

"శేఖరంగారూ! మీరేమంటున్నారో నాకు అర్థం కావటంలేదు. మీపై పుల్లయ్యగారు ఫోర్జరీ కేసు పెట్టిన సంగతి మాత్రం వలుగురితోపాటు నేనూ విన్నాను. సత్యమెంతో మీ ఉభయులకు తెలుసు కాని ఇతరులకు ఎలా తెలుస్తుంది? ధర్మమెప్పుడూ ఓడిపోదు. ఏనాటికైనా గెలిచి తీరుతుంది. సత్యం తెలిసిఉంటే ధర్మానికి నిలబడటం న్యాయం. దానికి ఎవరూ కాదనరు."

"ఇదుగో ఇలా చూడండి. పుల్లయ్యగారి లెక్కలన్నీ మీరు చూస్తున్నారు. నిజం మీకు తెలియదా? నామనస్సు బాగాలని చూస్తున్నారు. అందులో తప్పేమీ లేదు. పంతులుగారు, కాస్త ఆలోచించండి. సమాజములో లేశమైనా నీతి, నియమం, సంస్కారం ఉన్నవంటే అవన్నీ మీ పూర్వులు పెట్టినభిక్ష. సంకుచితత్వం స్వార్థం అధిగమించి సమాజాన్ని యీ స్థాయికి తీసుకువచ్చారు. ఏ ధర్మంకోసం సర్వసంగపరిత్యాగం చేసి తపస్సు చేశారో, ఆ ధర్మాన్ని మీ కాళ్ళక్రింద నలిపి వేయకండి. ధర్మం దానికంతకు అది ఎన్నడూ నెగ్గదు. మానవుడు తోడ్పడాలి. సుప్రతిష్ఠితం చేయాలి. కేవలం నాకోసమని నేడు ధర్మప్రసక్తి తేవటంలేదు. ఆస్తి అంతా ధ్వంసం చేసుకొన్నాను. ఇవాళ ధర్మంకోసమని చెబితే ఎవడు నమ్ముతాడు? లేదు. కేవలం కార్మికుల రక్తంపిండి త్రాగటానికే, తలపెట్టాను. యుగయుగాలనుండి వస్తున్న సంస్కారాన్ని కూకటివేళ్ళతో పెకలించి వేయటానికి తలపెట్టాను. ఆఘోరపాపమే బెడసి కొట్టిందేమో ఎవరికి తెలుసు? కాని నా పాపఫలం నేను అనుభవించాలి. అంతేకాని పసిపిల్లలు చేసినపాపమేమిటి? తప్పుచేశానని రేపు నాకు కారాగారవాసశిక్షవేస్తే వాళ్ళగతి ఏమౌతుంది? వాళ్ళకు నీళ్ళుపుడతాయా? కూలినాలి చేసుకొని అయినా జీవించటానికి అవకాశం ఉంటుందా? ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు ఎలా అవుతాయి? నాకోసం కాదు. ఆ పిల్లలు సగౌరవంగా బ్రతకటానికి మార్గం చూపించండి. దీనికి ఎంతో త్యాగం చేయవలసి ఉంటుంది. "వాస్తవమే నేను కాదనను-పుల్లయ్య మండిపడతాడు. పగ సాధించటానికి ప్రయత్నిస్తాడు. కాని మీకు ఉన్న గౌరవాన్ని నాశనం చేయలేడు. ఇప్పుడున్న జీవనోపాధి పోదు. అతని దగ్గర కాకపోతే మరొకరి దగ్గిర గుమాస్తాగిరి చేస్తారు. నేరుగా నేడు మీకు ఏవిధ

సహాయం చేయలేను. ఇదీ పరిస్థితి. ఈసంగతిచెప్పి మీసహాయం పొందాలని వచ్చాను."

సత్యనారాయణ కొంతసేపటివరకు మాట్లాడలేదు. ఆ మౌనం శేఖరానికి భయంకరంగా ఉంది. అతనికి గుండెలు కొట్టుకొంటూ ఉన్నాయి. ప్రక్కచెట్ల తోపులోనుంచి గుడ్లగూబ కూసింది.

"శేఖరంగారు! ఏమిచెప్పమంటారు? మాపూర్వులు ఎప్పుడైనా ఏదైనాచేసిఉంటే అపేక్షబుద్ధిలేక స్వతంత్రులై చేయగలిగారు. నేనుఆస్థితిలో లేను. నాకు క్షుత్పిపాసలున్నాయి. పైగా పరాధీనమైనబ్రతుకు. ఇలాంటి వాడు ధర్మాధర్మాలు నిర్ణయిస్తాడా? వట్టిది శేఖరంగారూ వట్టిది. మీలాంటివారే దానికి సమర్థులు, నావంటివారివల్ల ఏమౌతుంది? నేను చాలా సామాన్యుణ్ణి. ఈనాటి స్థితిగతులు నాకు తెలియవు. ఆలోచించుకొనే తాహతుకూడాలేదు. ఎందుకు నన్ను వ్యవహారంలోకి లాగుతారు? మంచిచెడ్డలేవో మీలాంటివాళ్ళు నిర్ణయించి చూపితే, నాలాంటివాళ్ళు అనుసరించటానికి ప్రయత్నిస్తారు. ప్రయత్నించటానికైనా కొంతశక్తి సామర్థ్యాలు కావాలి, అవికూడా ఉన్నట్లుగా తోచటంలేదు. క్షమించండి శేఖరంగారూ! అంతకన్నా నేను చేయగలిగింది ఏమీ కనిపించటంలేదు."

"అంతేనా? మీరు నాస్థితిలోనే ఉన్నారనుకోండి. అప్పుడేమి చేస్తారు?" నిరుత్సాహంగా శేఖరం ప్రశ్నించాడు.

"మీరు తప్పుచేశారని నేను అనలేదు. అనబోను. అనలేనుకూడా. నాపరిస్థితి మనవిచేశాను."

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు. చివరికి చంద్రశేఖరం తనకుతాను చెప్పుకొంటున్నట్లుగా అన్నాడు.

"ఇంతవరకూ పొరపాటు పడ్డానన్నమాట. మంచిచెడ్డలు, ధర్మాధర్మాలు ఎవరికివారు నిర్ణయించుకొని అనుష్ఠించే వనుకొన్నాను. కాదు-అవి సంఘం తేల్చవలసినదే. ఏదిధర్మమో, ఏదిశాస్త్రమో సమాజమే తేల్చాలి. అంటే ఉమ్మడిగా పశుబలంతో తేల్చవలసినదే నన్నమాట. ఎవరుఎక్కువ మందిని ఆకర్షించగలిగితే వారిదే శాస్త్రం వారిదేధర్మం. కాబట్టి శాస్త్రాలు సిద్ధాంతాలు భావాలు డబ్బునుబట్టి ఉన్నాయంటే ఆశ్చర్యపడవలసిన ఉంది? పంతులుగారు సరిగానే చెప్పారు. ఏమండోయ్, మీసలహా

మరచిపోలేను. అనవసరంగా మీకు లేనిపోని ప్రయాస కలిగించి ఇక్కడ
దాకా తీసుకువచ్చాను. క్షమించండి. ఊళ్ళోకి బయలుదేరుతున్నారా?"

శేఖరం లేచాడు. అతని వెంట సత్యనారాయణ బయలుదేరాడు.
శేఖరం తన యింటిదారి పట్టాడు. సత్యనారాయణ డాక్టర్ దగ్గరకు పోదా
మని అటు కొంతదూరం వెళ్ళాడు. ఇప్పుడు పోయి అతని నిద్ర చెడగొట్టటం
దేనికి? అతని అభిప్రాయమేమిటో ఇదివరకే తేల్చి చెప్పాడుగా? ఈ
సంగతి చెప్పినా అతడు కొత్తగా యిచ్చే సలహా ఏముంటుంది? అతని మన
స్సులో పుల్లయ్య కనిపించాడు. "ఏమోయి పంతులూ, నీకంద్రికీ నీకూ
ఇన్నేండ్లనుంచి తోడ్పడుతున్నానే ఇంతకూ నువ్వు చేయబూనుకొన్న దేంటి?
ప్రత్యర్థులతో జేరి నన్ను ధ్వంసం చేస్తావా? ఈ నీతినే నీపిల్లలు నీపట్ల అవలం
బిస్తే యెలా ఉంటుంది? అసలు కుటుంబజీవనం ఉంటుందా? నీమాత్రం ధర్మ
దీక్ష ద్రోణుడికి లేదంటావా? అతనికన్న నీవు యెందులో గొప్పవాడివి?
కౌరవులు చేసినది అన్యాయమని అతనికి స్పష్టంగా తెలుసు. అతడు పాండ
వుల పక్షాన యెందుకు చేరలేదు? ఏం పంతులూ మాట్లాడవేం? న్యాయ
మంటే నల్లగా ఉంటుందో, తెల్లగా ఉంటుందో నీకేమి తెలుసు? నీ ఒక్కడి
వల్లా ఏమౌతుంది గనక? అనవసరంగా తింటున్న కూడు పాడుచేసుకోకు.
హామీ నిజంగా ఇచ్చానో లేదో మా ఉభయులకే తెలుసు, కాని మరొకరికి
తెలియాలన్న అవసరం లేదు. తెలిసి ఉండి సత్యం చెప్పలేదని నిలవేసి నిన్ను
యెవరూ అడగలేరు. అంతగా వస్తే నేనులేనా? ఊరక చూస్తూ ఊరుకుం
టావా? నీకు దెబ్బతగిలితే ఒకటీ, నాకు తగిలితే మరొకటేనా? చేతనైతే
ఆ ధర్మవిచారం నా దగ్గర వచ్చి సాగించు. అంతే కాని పిచ్చిపిచ్చిగా వ్యవహ
రించకు" అని హెచ్చరించాడు.

నిజమే. తాను తొందరపడటం దేనికి? పుల్లయ్య పొరపడి కేసు పెట్టి
ఉండవచ్చును. దాన్ని యెత్తివేసుకోటానికి ఇంకా అవకాశం ఉన్నది.
అతడు నిజంగా యెత్తివేసుకోంటాడు కూడా. శేఖరంగారిని అనవసరంగా
జైలుకు పంపి ఏవిధంగా లాభిస్తాడు? స్థితిగతులు చూచి చేయవలసిందేమైనా
ఉంటే అప్పుడే చేయవచ్చును. ఇప్పుడు తను తొందరపడవలసిన అవసర
మేముంది?

సత్యనారాయణ ఇంటికి వెళ్ళాడు. మంచం తన మామూలుకు
మించి మరొకసారి మాత్రమే కిరకిరలాడింది.

# 11

కేసు విచారణ సమీపిస్తున్నది. పుల్లయ్యకు ముందుకు పోవటానికి మనస్కరించటంలేదు. వెనక్కు జారుకోటానికి మార్గం కనిపించటంలేదు. ఒకసారి బోనుఎక్కితే ఎన్ని అబద్ధాలు ఆడవలసివస్తుందో! అతనికి కీళ్ళ నొప్పులు బయటపడ్డాయి. వంగనీయవు కూర్చోనీయవు. అన్యాయానికి దిగితే ఏమవుతుంది? ఈశ్వరుడు చూస్తూ ఊరుకుంటాడా? ఛా. అను మానమే రోగం. తను అనవసరంగా ఉలిక్కి పడుతున్నాడు. ఈ రోగం ఇదివరకు ఏతప్పుచేస్తే వచ్చింది? అసలు నోటీసు ఇచ్చినప్పుడే రావాలి గదా? తాను అనవసరంగా భయపడుతున్నాడు.

పుల్లయ్యకు ఈ విచారంతో కొంత ఆందోళన కలిగింది. ఇంతగా కలవరపడుతున్న తాను నిద్రలో కలవరిస్తాడేమో? ముసలమ్మ వింటే ఏమౌతుంది? తన గౌరవం నిలుస్తుందా? కోడలికి చెప్పుతుంది. ఆమె ఏమను కొంటుంది? తన కుటుంబంలో తాను తిరిగి తలఎత్తుకొని తిరుగు తాడా? సీత, రాముడు తనముఖం చూస్తారా? అతడు వణికిపోయాడు. నాటినుంచి కంటికి కూర్కుకూడా దూరం కాసాగింది. ఒకవేళ కాస్త కునుకు తీసినా అందరు పడుకున్న తరువాతనే పండుకుని అందరికన్నా ముందుగా లేచేవాడు. ఎన్నాళ్ళని ఇలా సాగేటట్టు?

కేసు ఎత్తివేసుకునే మార్గంలేదా? ఆలోచించాడు. చంద్రశేఖరం ఊరుకుంటాడా? అయిదువేలు అతని ఎదాన పోసింది చాలక పరువు నష్టం క్రింద ఎంత చెల్లించమంటాడో! ఈబాధ ఎవరితో చెప్పుకుంటాడు?

ఒక రోజున పంతులు తండ్రి చనిపోయాడని విని పుల్లయ్య చూడ వచ్చాడు సత్యనారాయణను. ఆ కుటుంబాన్ని ఓదార్చాడు. నిజానికి తనకూ ముసలి పంతులకూ పెద్ద తేడాలేదు. కాకపోతే పది పన్నెం డేళ్ళు పెద్దవాడేమో. పుల్లయ్యకు భయం కలిగింది. తాను కూడా చావక తప్పదు. రేపే ఊడతాడో ఎల్లుండే ఊడతాడో-ఈ మట్టిఘటాలు శాశ్వతమా? ఆ రాత్రి మంచంలో పండుకొని దొర్లుతూ ఉన్నాడు. దగ్గర్లో చిన్న మంచంమీద లక్ష్మమ్మ పండుకొన్నది. ఆమె నిద్రపోతు న్నట్లు కనిపించలేదు.

"అమ్మా అమ్మా!"

"ఏమిటి?"

"ఏ క్షణంలోనైనా చావు తప్పదుగదా, మనుషులు తప్పుడు పనులకు ఎందుకు దిగుతారో?"

"నిజమే ఈ శరీరాలు, ఆస్తిపాస్తులు శాశ్వతమన్నట్లుగా చూస్తారు. అదే అర్థంకాదు."

కొంచెం సేపు ఇద్దరూ మాట్లాడలేదు. పుల్లయ్య నిట్టూర్చి అన్నాడు.

"ఇదిగో అమ్మా! మనం తెలియకుండా యెన్ని పాపాలు చేస్తున్నామో! అలాంటప్పుడు యిది పుణ్యమని ఇదిపాపమని ఎలా చెప్పటం?"

"చాల్లే ఎవ్వరన్నా వింటే నవ్విపోతారు. పాపం-పుణ్యమెలా అవుతుంది? పుణ్యం-పాపం ఎలా అవుతుంది? పగలు పగలే. రాత్రి రాత్రే. ఏళ్ళు పైబడ్డ కొందికి మతి పోతున్నట్లున్నది."

బయట ఆ రాత్రి ఉరుములు, మెరుపులు, జోరున వాన; పుల్లయ్య మనస్సు ఆలోచిస్తూనే ఉన్నది.

"సరేకాని అమ్మా, ఒకడు పాపంచేసేచచ్చిపోతాడు. నరకలోకంలో వాడు తగిన శిక్ష అనుభవిస్తాడు. బాగానే ఉన్నది. కాని ఆ పాపకర్మ ఫలం అన్నెము పున్నెము తెలియని ఇతరులు కూడా అనుభవిస్తున్నారే యెందువల్లనంట? వీళ్ళుకూడా వెనక జన్మలో పాపంచేసి ఉండాలి. అప్పుడు పాపమనేది ఒకడుచేసేది కాదు. పదిమందికి సంబంధించినది కావాలి. అంటే పాప పుణ్యాలు అనేవి యెవడికివాడు ఒంటరిగా చేసేవి కావన్నమాటేగా. 'అలాంటప్పుడు నీవు పుణ్యంచేయి. పాపంచెయ్యకు' అని వ్యక్తులకు ఎందుకు, చెబుతున్నారు? పాపి శిక్ష అనుభవించినా పాపకర్మ నశించటంలేదు. అయినప్పుడు స్వర్గనరకాలు దేనికి?"

"పాప పుణ్య ఫలాల సంగతి అనుభవంసంగతి మానవ మాత్రులకు అర్థం కావులే. ఎవరో అవతారపురుషులు చెప్పవలసిన మాటలు నీకు దేనికి?"

లక్ష్మమ్మ పక్కకు తిరిగి పడుకొన్నది.

పుల్లయ్య కన్నుమూశాడు. చంద్రశేఖరం సంతతి చినిగిన గుడ్డలతో, మాసిన తలలతో, శోకాలతో సాక్షాత్కరించారు. "ఓరి దుర్మార్గుడా!

ఎంత పని చేశావు! మా కొంప నిలువునా తీశావు. అంతతో ఊరుకున్నావా? మా నాన్నను జైలుకు పంపించావు. మా పరువు ప్రతిష్ఠలు మంట గలిపావు? సంఘంలో మాకు నీళ్ళు పుట్టకుండా చేశావు. నీ మూలాన మాకీగతి పట్టింది. అంతా నువ్వే చేశావు. ఈ పాపం ఊరికే పోతుందా? నీ కొడుకు, కూతురు, కోడళ్ళు, మనుమళ్ళు మాలాగే దిక్కులేని పక్షులై దేశమ్మకాకులై అలో అత్తమ్మా అంటూ అంగలార్చి చావకుండా ఉంటారా? పసివాళ్ళ ఉసురు ఊరకే పోదు. ఇంతకు ఇంత అనుభవించి తీరుతావు. తప్పదు తప్పదు" అని శపిస్తున్నట్లు వినిపించారు. గడగడ లాడిపోయాడు. ముచ్చెమటలు పోసుకొచ్చాయి. బాధతో మూలిగి మరోప్రక్కకు తిరిగి పండుకున్నాడు. మళ్లీ కాస్త కునుకుపట్టింది. కోర్టువిచారణ ప్రారంభమైంది. తన్ను ప్రమాణం చేసి యదార్థము చెప్పమని అధికారి అడిగాడు. కళ్ళుతిరిగి బోనులోనే కుప్పనకూరగా కూలాడు. దానితో పుల్లయ్య ఉలిక్కిపడి లేచాడు. అత్తమ్మ గాఢనిద్రలో ఉంది. ఎంతపొద్దుపోయిందో! అన్నట్లు బయటికి పోతేమాత్రం ఏమి తెలుస్తుంది? కారుమబ్బులు కమ్ముకుంటాయి. తనకు శిక్షపడి జైలులో ఉండివచ్చినా శేఖరం పడ్డబాధ పోతుందా? ముసలిది యెంతహాయిగా నిద్ర పోతున్నది! వీళ్ళకు ఇంతనిద్ర యెలా వస్తుందో!

మరునాడు పొలం పోతుంటే పుల్లయ్యకు మల్లయ్య ఎదురయ్యాడు. మల్లయ్య నవ్వుతూ "పొలందాకానా?" అని అడిగాడు. అతను అవునని తల ఊపాడు. మల్లయ్యది అంతా నవ్వేనా? అతని కడుపులో ఎంత విషము వుంది! ఆ చంద్రశేఖరం కాక మల్లయ్య అయితే ఎంత బాగుండేది! అతనితో చేతులు కలిపి చూచినా అది ఒక అందమూ చందమే బలాబలాలు తేలివుండేవి. అసలే చంద్రశేఖరం అర్భకుడు. ఇప్పుడు మరీ అడుగు జారి ఉన్నాడు. పైగా అక్రమ మార్గం అవలంబించి సాధించ బోతున్నాడు. ఇంతకన్నా ప్రపంచములో నీచత్వమేమి ఉంటుంది? పుల్లయ్యకు తనమీద తనకే అసహ్యం కలిగి చుట్టను కొరికి తుప్పున ఊశాడు.

ఆ రాత్రి అతనికి పుణుకరింత వచ్చింది. అది సన్నిపాతమే. తనకు చావుతప్పదు. తనపాపమే వెడిసి కొడుతున్నది. భగవంతుడు లేడూ మరి! మనుషుల కన్నులు మూసుకువచ్చును కాని అతని కన్నులెల్లా మూయుటం? లాభంలేదు. అన్నట్లు చీకట్లో ప్రొద్దుపోయిన తరువాత చంద్రశేఖరం పంతులు కలిసి వస్తున్నారని పొట్టి రామయ్య చెప్పాడే! పంతుల్ని శేఖరం

చేరదువ్వుతున్నాడు కామాలు ! పంతులైనా అంత తెలివి తక్కువ వాడు కాడు. చూస్తూ చూస్తూ తన జీవితం నాశనం చేసుకుంటాడా ? ఆ సంగతి నాతో చెప్పి ఉండవలసిందే? ఏ పుట్టలో ఏపామున్నదో ఎవరు చూచారు? ఈ అవస్థ అంతా దేనికి? ముక్కుకు సూటిగాపోతే బాధేలేదు. ఈ అవస్థ అంతా దేనికివచ్చినట్లు? మాటకోసమే కదా పెనుగులాట! ఈ ఒక్కమాట కోసం ఇంత అన్యాయానికి ఎందుకు ఒడిగట్టాలి ? తెల్లవారగానే ముసలి దానితో చెప్పివేస్తే తీరిపోతుంది. సాయంకాలం శేషగిరి దగ్గరకు వెళ్ళితే మిగతా వ్యవహారాలన్నీ అతగాడే చూచుకుంటాడు. ఎందుకు వచ్చిన లాయిలాసా?

పుల్లయ్యకు గుండెకుంపటి తీసివేసి నట్లయి "అమ్మయ్య" అని నిట్టూర్చి హాయిగా నిద్రపోయాడు. కిరకిర పొద్దు పొడుస్తున్నది. పాల కోసం కోడెదూడ 'అంభా' అని అరుస్తూ ఉంది. అప్పటికీ అతడు నిద్రలేవ లేదు. లక్ష్మమ్మ గదివాకిట్లో నిలబడి "ముసలయ్యా, ముసలయ్యా! నిన్నే పిలిచేది" అంటూ లేపింది. అతడు మరొక ప్రక్కకు తిరిగాడు. "నిన్నే పిలిచేది. ఎవరో నీకోసమొచ్చారు!" కండ్లు నలుపుకొంటూ లేచి ఆవులించి "ఎవరది?" అని అడిగాడు.

"ఏమో, దొడ్లో ఉన్నాడు."

పుల్లయ్య దొడ్లోకి వెళ్ళగానే వీరయ్య కనిపించాడు. ఈ దరిద్రుడి కోసమేనా తానింత హడావుడిగాలేచి వచ్చింది !

"ఏం వీరయ్యా ! ప్రొద్దున్నే వచ్చావు"

"ఆ ఏమున్నది, ఒకమాట చెవినివేసి పోదామని వచ్చాను"

"ఏమిటది ?"

"మీరు కేసు పెట్టారుగా !"

"అయితే..."

"మీకు ప్రతికూలంగా సాక్ష్యం చెప్పను."

"ఎవరన్నా చెప్పమంటున్నారా ?"

"లేదు."

పుల్లయ్య అనుమానించాడు. ఎవరో వీరయ్యకు డబ్బిచ్చి ఎక్కడో ఉంటున్నారు. తనవద్ద కూడా గిట్టుబాటు చేసుకోవటానికే వచ్చివుంటాడు. లేకపోతే ఈ మాట అతడు తన చెవిని వేయవలసిన అవసరం లేదు.

"శేఖరం నీకు పాగాకు కొని పెడుతున్నాడా ?"

"ఒకరు చెప్పనుంటే చెప్పే ఘటం కాదు. ఆ భగవంతుడే చెప్ప మంటున్నాడు"

"ఏమనీ ?"

"ఏమని ఏముంది? ఆనాడు మీతోపాటు మాధవయ్యగారి వెంట ఇంటికి వచ్చా."

"ఏ రోజున ?"

"హోమియాయన్తూ సంతకంచేసిన రోజున" పుల్లయ్య తేరిపారజూచాడు.

"నీకు మతి మళ్ళింది. ఎందుకు వచ్చినబెడద ? కృష్ణా రామాఅంటూ ఒక మూల కూర్చోక"

పుల్లయ్యకు ఏదో ఆలోచన తట్టింది. "నీకు మతిలేదు. సాక్ష్యానికి పనికిరావని చెప్పిస్తాను." వీరయ్య వెళ్ళిపోయాడు.

"వీళ్ళా నన్ను సాధించేవాళ్ళు ! ఆ పూటకులేని దద్దమ్మలా నాకు చెప్పేవాళ్లు ! తప్పుచేస్తే దండించ వలసినవాడు భగవంతుడు కాని వీళ్ళెవరు మధ్య ? కాదనివస్తే పుల్లయ్య తడాఖా ఏమిటో రుచి చూస్తారు" అని మీసం మెలిపెట్టాడు.

ఆనాడు భోజనంవడ్డిస్తూ పుల్లయ్యతో లక్ష్మమ్మఅన్నది; "విన్నారూ, అమ్మాయమ్మ లలితగారింటికి చూచివద్దామని వెళ్ళిందట. ఆపదలో ఉన్నది కదా అని పెద్దపిల్లల్ని ఇద్దర్నీ ఆశ్రమంలో ఉంచుకుంటానంటే అనరాని మాటలు అని పంపించిందట! పెద్దలు చెబుతారే- అలాఉంది వ్యవహారం."

"నీకు ఎవరు చెప్పారు ?"

"ఆమే నిన్న మధ్యాహ్నం మన యింటికి వచ్చినప్పుడు చెప్పుకుని కంట తడిపెట్టింది. ఒకటేమిటి అమ్మాయమ్మను, ఆమె చెల్లెల్ని ఏమేమో అన్నదట. ఏమనకపోతే కంటతడి పెట్టుకుంటుందా?"

పుల్లయ్య ఈ కొట్లాడే కాని మరేమీ పోట్లాడలేదు. అతను ఆలోచించాడు—తను చేయవలసినపని అమ్మాయి మొత్తం చేస్తుంది. ఉన్నవి లేనివి కలిపించి చంద్రశేఖరాన్ని, ఆ కూటమి వాళ్ళని ఎంత అల్లరి పాలు చేయాలో అంతా చేస్తుంది. ఇప్పుడే తాను మేలుకోకపోతే నలుగురికీ శేఖరం మీదనే అనుమానం కలుగుతుంది, కాని తనమీద ఎవరికీ అపోహ కలగదు. ఈ అవకాశం జారిపోనీయరాదనుకున్నాడు.

ఇది ఇలా ఉండగా ఎన్నడూ కేసు గాని వెంకటరావుకు చంద్రశేఖరం వకాల్తా యిచ్చాడని తెలుసువచ్చింది. బాగానే ఉన్నది. "నోట్లో నాలుక లేనివాడా చంద్రశేఖరం కేసు గెలిపించేది?" చంద్రశేఖరం నిర్దోషిత్వం రుజువు చేయటమే కాక మాననష్టపరిహారం కక్కిస్తానంటున్నాడని విన్నాడు. కాగితాలమిల్లు మూలపడటానికి కూడా తానే కారణమని చెప్పించటానికి చంద్రశేఖరం సాక్షులను సమకూర్చాడని పుల్లయ్యకు తెలిసింది.

పుల్లయ్య ఫక్కున నవ్వాడు. అతనికి ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది. కాగితాలమిల్లు మూలపడటానికి తాను కారణమా? తప్పుడు సాక్ష్యం చెప్పటానికి సిగ్గెట్లా లేదు? మానాభిమానాలను తిలోదకాలిచ్చిన వాళ్ళు దేనికైనా సిద్ధమౌతారు. రేపు ఒకణ్ణి చంపమన్నా చంపుతారు. ఇలాంటివాళ్ళను చూస్తూ ఊరుకుంటే బ్రతకటానికి వీలవుతుందా? తప్పకుండా అంతు కనుక్కోవలసిందే.

పసుపు వ్యాపారంలో ఊళ్ళో వాళ్ళను పుల్లయ్య మోసం చేసాడని, సత్రానికి ధర్మకర్తగా ఉండి దానికింద ఉన్న ఏడెకరాల ఫలసాయం భుక్త పరచుకొన్నాడనీ, లేకపోతే మూడెకరాలవాడు డాబా కట్టించి ఏభైవేలు ఎలా తిప్పుతున్నాడనీ చంద్రశేఖరం ప్రచారం మొదలుపెట్టాడు. దీనితో పుల్లయ్యకు కారం రాచినట్లయింది. తన తప్పు మరచిపోయి లోకమంతా తన్ను అన్యాయంగా ఎదుర్కొంటున్నదనీ, ఆత్మరక్షణకు పూనుకోవటం విధ్యుక్త ధర్మమనీ భావించసాగాడు. దీనితో అప్పటిదాకా ఉంటున్న జంకుగొంకులు సడలిపోయి ధైర్యం ఏర్పడింది.

మనస్విమితత్వం లభించగానే కీళ్ళనొప్పులు మటుమాయమై పోయాయి. చంద్రశేఖరం ఏ యెత్తులు ఎత్తుతాడా, తాను వేయవలసిన పై యెత్తులు యేమిటా అని ఆలోచించ మొదలు పెట్టాడు. ఇప్పుడు అతని

ప్రత్యర్థి చంద్రశేఖరం కాదు. అతని పక్షాన సాక్ష్యానికి తయారవుతున్న వాళ్లు. వాళ్ళచరిత్ర అంతా జ్ఞాపకం చేసుకో మొదలుపెట్టాడు. వాళ్ళంతా లోగడ తనకు అపకారం చేసినవాళ్ళే. వాళ్ళందరిమీదా కక్ష సాధించటం అవసరం. పొట్టిరమణయ్యగాడు ప్రతిసంవత్సరం తన చేనిగట్టు నరుకుకొంటూనే ఉన్నాడు. మల్లయ్యగాడు చేలోకి బండి పోనీక నానాయిబ్బంది పెడుతున్నాడు. తాను కొనటానికి సిద్ధమైన పసుపు కాస్తా ఒక అర్థరూపాయి హెచ్చుపెట్టి తన పాతట్లో పోయించుకొన్నాడు. సరుకే ప్రధానమైతే అతనికి మరొకచోట దొరక్కపోయిందా? కాదు, తన్ను నష్టపరచటమే ప్రధానం. కాని వాడు ఏ నక్షత్రానపుట్టాడో ఒకళ్ళు పచ్చగా ఉంటూ ఉంటే కళ్ళారచూడలేడుకదా? వీడు వదిత్తే ఊరికి మహాప్పాతిః పీడ వదుల్తుంది. అసలు చంద్రశేఖరానికి 'కీయిచ్చి' తిప్పుతున్నది వాడే కావాలి. అంతే కాని యీ అపరబుద్ధులు అతనికి పుట్టినవి కావు. స్కూలు విషయములో అలాధ్వంసం చేస్తున్నాడు. పంచాయతీబోర్డులోచేరి అలా చేస్తున్నాడు. నసాళంపగిలేట్టు దెబ్బకొడితే కాని బుద్ధిరాదు. ఊరు బాగుపడదు. ఈ వ్యవహారం అసలు చంద్రశేఖరానిదే కాదు. మూలసూత్రధారుడు మల్లయ్యగాడే. ఇప్పుడు తప్ప మరొకసారి ఒంటరిగా చిక్కాలంటే చిక్కడు. ఈ వ్యవహారంలోనే తేల్చుకోవాలి.

పుల్లయ్యకు పూర్తిగా చలి తీరింది. వందతప్పిదాలు చేయలేదు. ఒకటి మాత్రం తాను చేశాడా! తాను ఇలాంటి పాపిష్టి లోకానికి యెందుకు భయపడాలి? ఎవరికి భయపడాలి? ఇంకా తనమీద ఏమేమి బయలుదేరుతున్నవో జాగ్రత్తగా ఆరాతీస్తూ వచ్చాడు. ఆరోపణలు వింటున్న కొద్దీ మనస్సు మరీ బిరబిగిస్తూ వచ్చింది. అసలు సంగతి మరచిపోటానికి అవకాశం ఏర్పడుతూ వచ్చింది. ఒక రోజున విన్నాడు; తాను, తనకొడుకూ కమ్యూనిస్టులట. తన కొడుకును అండర్ గ్రౌండులో దాచాడట! తాను అన్ని విధాల వాడికి సహాయం చేస్తున్నాడట! కమ్యూనిస్టు కాకపోతే గ్రామంలోకి ఎందుకురాడు అని అంటున్నారు? నూటికి నూరుపాళ్లు తన కుటుంబము జాతీయవాదాన్ని బలపరుస్తున్నది. తన మనమడి దగ్గరనుంచి కోడలుదాక అంతా ఖద్దరు కడుతున్నారే! తన కుటుంబమంతా కమ్యూనిస్టులా? తన కొడుకును పట్టిస్తారా? వీళ్ళను ఏమిచేస్తే పాపం తీరుతుంది?

పుల్లయ్యకు తనపై యిలాంటి ఆరోపణ ఉన్నట్లు తెలియని నాడు మనస్సు అదోకవిధంగా ఉండేది. లోకమేదో అంటున్నదని కల్పించుకొనేవాడు. తాను భార్యను జంకి చంద్రశేఖరం మీద యీ అఘాయిత్యానికి దిగాడని అంటున్నట్లు భావించాడు. తాను భార్యకు జంకి యీ పని చేస్తున్నాడా? అసలు తాను భార్యకు జంకుతాడా? ఇంతకన్నా అబద్ధమేమి ఉంటుంది? వాళ్ళకున్న గుణాలనే ఇతరులకు ఆరోపిస్తుంటారు. దుష్టులకు లోకమంతా దుర్మార్గంగానే కనిపిస్తుంది కాని మరోకవిధంగా ఎలా కనిపిస్తుంది?

ఈవిధంగా కొత్తకొత్త ఆరోపణలు తెలియకుండానే స్వయంగా కల్పించుకొంటూ సాక్షులను పయురాల్చుకొని పుల్లయ్య కేసు విచారణకు ఆయత్తమయ్యాడు.

# 12

"ఇప్పుడేం చెయ్యాలి?"

"భోజనం"

"అంత ఎగతాళిగా ఉంది బ్రతుకు?"

"ఎగతాళేమిటి? తిండిలేక ఏడ్చేవాళ్ళు ఏడుస్తూ ఉంటే, నాకు తిండి అక్కరలేదని భీష్మించుకొని కూర్చుంటావేమిటి? నీఒక్కడివల్ల లోకం బాగుపడుతుందా! ఈ నాలుగు రోజులుపోతే ఈ పట్టెడు మెతుకు అయినా దొరుకుతాయని గుండెమీద చేయివేసుకొని చెప్పు."

"ఇప్పుడు ఆగోడవంతా దేనికి? చూస్తూ అన్నెం పున్నెం తెలియని చంద్రశేఖరాన్ని జైలుకు పంపించ వలసిందేనా? లేదంటే ముసలివాణ్ణి పంపించాలి. ఎంత కాదనుకొన్నా కన్నతండ్రి. ఎత్తిపెంచాడు. ఎలా పంపించేటట్లు? ఈ వయస్సులో అతడు జైల్లో ఎలా ఉంటాడు? మంచి పుగాకు లేకపోతే గడియ గడవదే! ఏ సంవత్సరమో రెండుసంవత్సరాలో పడితే ఎలాగు? అతనిసంగతి ఎలా ఉన్నా కుటుంబం ఏమౌతుంది? అమ్మ, అమ్మతోపాటు సీత మంచం పడుతారు. ఊళ్ళో నాకుమాత్రం గౌరవ ముంటుందా? ఫలానివారి అబ్బాయి అని అనరా? అప్పుడు ముఖం ఎక్కడ దాచుకొనేటట్లు!"

"అందుకనేగా ఈగది సంపాదించింది. ఇక్కడ దాచుకోవచ్చు. మరేమి ఫరవాలేదు."

ఇలాంటి తర్క వితర్కాలలో బడి రామారావు కొట్టుకు పోతున్నాడు. అతని చేతులకు కాంపుకాటు అంచులు తగులుతున్నాయి కాని మనస్సుకు మాత్రం ఏదరీ దొరకటంలేదు.

రామారావు పుల్లయ్య చిన్నకొడుకు. కలకత్తా విశ్వవిద్యాలయంలో యం. ఏ. డిగ్రీ పుచ్చుకొన్నాడు. అంతటితో సంతృప్తిపడి ఉద్యోగంలో ప్రవేశిస్తాడని తండ్రి ఆశించాడు. కాని అతనికి మాత్రం విద్యాతృష్ణ తీరలేదు. దేశంలోని స్థితిగతులు, అంతర్జాతీయ అవ్యవస్థ అతన్ని రెచ్చగొట్టాయి. ఆర్థిక రాజకీయ సంస్కృతి రంగాలలో పుంఖలకెత్తిన వాదాల మూలతత్వం తెలుసుకొందామన్న జిజ్ఞాస కలిగింది. నాయకుల పాలికేకలలో పడి కొట్టుకొనిపోక తనకుతాను ఆలోచించి మంచి చెడుగులను నిర్ణయించుకోవాలన్న తహతహలు ప్రబలమయ్యాయి. తండ్రి వద్దన్నా వినక మద్రాసులో ఉండి క్రమంగా తత్వశాస్త్రవిచారంలో పడ్డాడు. అతనికి అప్పుడే కళ్ళు తెరచుకొన్నట్లయింది. వివిధరంగాలలో జరుగుతున్న వన్నీ అవకతవకలేననీ, ఇవి చాలాకాలం సాగితే మానవునికి అభ్యుదయం సిద్ధించటంకల్ల అని ధ్రువపడిపోయింది. స్వాతంత్ర్యపిపాస, సత్యాన్వేషణ అన్నవి మానవునికి సహజసిద్ధాలు. ఈరెంటిని పురస్కరించుకునే మానవ జీవితం దొర్లుతూఉంది. ఈరెండూ ఒక్కధర్మంద్వారానే సాధ్యం. ధర్మం లేనినాడు చక్రం వూబిలో దిగబడిపోతుంది. మానవుడు అధఃపతనం పొందుతాడు. ఈనాడు దేశం ఇంత అధోగతిలో ఉండటానికి కారణం ఇదేనని అతడు పత్రికలలో వ్రాస్తూవచ్చాడు. విద్యార్థి సభలలో విమర్శిస్తూ వచ్చాడు.

అలాంటి రామారావును నేడు ఆ సమస్య ఎదుర్కొన్నది. మార్వాడీకి తండ్రి హామీ ఉన్నట్లు చంద్రశేఖరం ఫోర్జరీ పుట్టిస్తే అతనిపైకేసు పెట్టాడని తల్లి అన్నమ్మ వదినచేత తనకు ఉత్తరం వ్రాయించింది. ఆ ఉత్తరం చూడగానే రామారావు విస్తుపోయాడు. చంద్రశేఖరానికి అడ్డమున్నానని స్వయంగా తండ్రి తనతో చెప్పాడు. అలాంటప్పుడు చంద్రశేఖరం మీద కేసు పెట్టటంలో అర్థం కనిపించలేదు. తండ్రి ఇదివరకు

తెలిసినంతలో ఎలాంటి అన్యాయానికి ఒడికట్టలేదు. ఇప్పుడు అలాంటి పనికి ఎందుకు దిగుతాడు? బహుశః ఆ సంగతి మరచిపోయి కేసు పెట్టి ఉండాలి. అంతకుతప్ప మరొక కారణం ఉండటానికి వీలు లేదు. ఈ దృష్టితో రామారావు, తండ్రికి ఉత్తరం వ్రాస్తూ చంద్రశేఖరానికి హామీ యిచ్చిన సంగతి జ్ఞాపకం చేశాడు. ఆ ఉత్తరానికి సమాధానం తండ్రివద్ద నుంచి రావుకు నేడే చేరింది. "ఈ సంగతి నీకేమీ తెలియదు. కాబట్టి మొదలు కుండా ఊరుకోవటం ఉత్తమం. ఇప్పట్లో నీవు ఇక్కడికు రావద్దని మీ అమ్మకూడా చెప్పమంటున్నది." ఈ వాక్యమే రామారావు ప్రస్తుత స్థితికి కారణం. అతనికి ఆ క్రిందటిరోజున విద్యార్థుల సమావేశంలో తాను చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. "సోదరులారా! ఈనాడు ధరలు మిన్ను పెరిగిపో తున్నాయి. బుద్ధులు గడ్డిమేస్తున్నాయి. దీనికి అంతకూ కారణమేమిటి? నాయ కులలో ఉన్న అవినీతి. ఈ అవినీతి క్రొత్తగా పదవులు సంక్రమించిన తరువాత వచ్చినదనుకోవటం పొరపాటు. మొదటినుంచి వారు ప్రబోధిస్తూ వచ్చిన సిద్ధాంతాలలోనే ఉన్నది. ఆ సిద్ధాంతాలు సిద్ధాంతాలుగా ఉన్నంతకాలం మనకు వాటిలోవున్న అనర్థం బోధపడలేదు. అవి కార్యరూపం దాల్చినప్పుడు ఉన్న కుళ్ళంతా బయటకు కనిపిస్తూఉంది. మొదటినుంచి కాంగ్రెసు నాయకులు జాతీయ స్వాతంత్ర్యం కోసం, జాతీయ ఔన్నత్యం కోసం పోరాడండని జాతి పేరుతో సంఘం పేరుతో క్రొత్త దేవతను సృష్టించారు. ఆ దేవతకు బలి కావటం వ్యక్తిధర్మమని చెప్పారు. నేడు మాత్రం వారు చేస్తున్న దేమున్నది? ఆ జాతి ఔన్నత్యమే కోరుతున్నారు. దానికోసమే కృషి చేస్తున్నారు. ఇతరదేశాలపై ఆధారపడిన జాతి ఎప్పుడూ గొప్పది కాదు. ఆహార పదా ర్థాలలో స్వయం సంపూర్ణత సాధించాలి. అంటే దిగుమతులు పూర్తిగా నిషేధించాలి, సైనిక బలం పెంచాలి. భారీ పరిశ్రమలు లేని దేశం అధునిక సైన్యాన్ని నెలకొల్పలేదు. కాబట్టి భారీ యంత్రసామగ్రి సంపాదించ టానికి ఎగుమతులు ఎక్కువ చేయాలి. వ్యవసాయం ప్రధానమైన మనదేశం ఏమి ఎగుమతి చేయగలుగుతుంది? పొగాకు, జనపనార, మొదలయిన వాణిజ్యపు పంటలే కదా? దేశంలోని పొలాలు కొంతభాగం ఈ పంటలకు వినియోగించడం జరిగింది. ఫలితం తిండిగింజ కొరత మరీ అధికమైంది. ధరలు పెరిగాయి. తిండిగింజలధరలు పెరిగినప్పుడు మిగతా వస్తువుల ధరలు పెరుగక ఏమిచేస్తాయి? ధరలు పెరిగే అవకాశం కనిపిస్తున్నప్పుడు కొని నిల్వచేయు

టానికి, విపరీత లాభాలు సంపాదించటానికి ప్రయత్నిస్తాడు. అలాచేయని వాడు అసమర్థుడు తెలివితక్కువ దద్దమ్మా కావాలి. డబ్బు అధికారం ఎవరికిచేదు? అసలు మానవుణ్ణి ఆడిస్తున్నవి ఇవికావా? కాబట్టి మన నాయకుల సిద్ధాంతాలలోనే లోటువున్నది. జాతిఅంటే వ్యక్తుల సముదాయాన్ని మించి ఎక్కడా లేదు, వ్యక్తిసముదాయం అభ్యుదయమే జాతిఅభ్యుదయం మానవజీవితం మానవజీవితంకోసమే కాని పారలౌకిక సిద్ధికోసం కాదు. ధర్మం ధర్మంకోసమే ఆధర్మమే మానవజీవితం. తల్లి పిల్లవాణ్ణి యెందుకు ప్రేమిస్తున్నది? రేపు పెరిగి పెద్దవాడై పోషిస్తాడని చేస్తున్నదా? లేదు. ప్రేమించటమే ఆమె పరమార్థంగా, అలా ప్రేమించటంలోనే ఆత్మసిద్ధి ఆనందం వున్నాయని భావించి, అనుభవిస్తూ చేస్తూవుంది. ధర్మానికి ఫలసిద్ధి పరమార్థం కాదు. ఈ ధర్మానికి మానవుని అంతఃకరణమే పరమప్రమాణము. ఈ అంతఃకరణం ఎప్పుడూ వివేకచోదితం. ఈనాటి దురవస్థపోవాలంటే ప్రతిఒక్కడు భీతిని, ధనకాంక్షను, అధికారాపేక్షను, పక్షపాతబుద్ధిని పరిత్యజించి ధర్మం అనుష్ఠించాలి. ఇతరులు ఏమనుకొంటున్నారు, సానుభూతి చూపుతున్నారాలేదా, పేరు పేపర్లోపడుతున్నదా లేదా అని జంకరాదు. ఈ అనుమానంలోనే ఆనందం వున్నదనుకొని చేసినప్పుడే వ్యక్తికి, తద్వారా సమాజానికి అభ్యుదయం సిద్ధిస్తుంది. అంతకుతప్ప మరొక మార్గం లేదు. ఇలా చేయకపోతే వర్తమానం నరకకూపం. భవిష్యత్తు సందేహాస్పదం."

ఇలా చెప్పినతాను తిరిగి విద్యార్థుల ముఖం ఎలాచూస్తాడు? సిగ్గు లజ్జ అభిమానం వదలి వాళ్ళదగ్గరకు వెళ్ళినా తన్ను గౌరవిస్తారా? వాళ్ళు గౌరవించినా గౌరవించకపోయినా తనమనస్సుకు శాంతి వుంటుందా?

రామారావు లేచి ఆ చిన్నగదిలోనే పచారు ప్రారంభించాడు, సిగరెట్టుపై సిగరెట్టు వెలిగించాడు. గదిఅంతా పొగతోనిండిపోయింది. మనస్సుమాత్రం ఏడిడ్డుపట్టుక వచ్చింది. తండ్రివ్రాసిన ఉత్తరం మరొకసారి చదివాడు. "ఈసంగతి నీకేమీ తెలియదు. కాబట్టి మెదలకుండా వూరుకోవట - ఉత్తమం" ఈవాక్యాన్ని బట్టిచూస్తే తనతండ్రి చంద్రశేఖరంమీద కావలెనని కేసుపెడుతున్నట్లు స్పష్టమౌతున్నది. అలాంటప్పుడు తాను అసలుసంగతి జ్ఞాపకంచేసిమాత్రం ప్రయోజనమేమిటి? కాకపోతే తాను చంద్రశేఖరం పక్షాన సాక్ష్యంచెప్పాలి. చెబితే తన తండ్రికి కష్ట

జన్మస్థానం తప్పదు. కుటుంబం అంతా అల్లకల్లోలమై పోతుంది. తిరిగి తాను ఇంటికి వెళ్ళటానికి వీలులేదు. తల్లి తనముఖం చూడదు. సీతకు ఇంకా పెళ్ళి కావలసిఉంది. ఈ రభసఅంతా తెలిసినతరువాత ఆమెను ఎవడు పెళ్ళిచేసుకుంటాడు? నిజానికి నిలబడితే ఇవన్నీ జరగవలసిందేనా? సత్యం, ధర్మం ఇంత ఘోరాలా ? తాను ఎంతతేలికగా విమర్శించాడు ! మానవాభ్యుదయమేకదా ధర్మానికి పరమార్థం. తాను మౌనిగా నోమూపడితేనో! ఈ అనర్థాలన్నీ చంద్రశేఖరాన్ని అతని కుటుంబాన్ని ఆవరిస్తాయి.

రామారావుకు ఎటూ పాలుపోలేదు. ఇలాంటి దుర్భరదుస్థితి కనులారా చూచేకంటె మరణించటం మేలనుకొన్నాడు. మరణించినా జరిగే అన్యాయం జరగకమానదు. అలాంటప్పుడు తన మరణంవల్ల ప్రయోజనమేమిటి-అని ఆలోచించాడు. ఎలాగైనాసరే తండ్రికి చెప్పి నిజం ఒప్పించి కేసు ఎత్తివేయించుకొనేటట్లు చేయాలి. అందుకు ఒప్పుకొనకపోతే ఫలం అనుభవిస్తాడు. అంతకుతప్ప మరొకమార్గంలేదు. వెంటనే బయలుదేరి పోవటం అవసరం. తాను బయలుదేరి రాకుండా ఉండటానికే, ఇప్పట్లో ఇక్కడికి నీవు రావద్దని మీఅమ్మ కూడా చెప్పమంటున్నదని కూడా వ్రాశాడు. మానవ ప్రయత్నం మాని చేసేదేమున్నది?

అతడు కాంపుకాటు మడిచి సంచిలో పెట్టాడు. చిందరవందరగా పడివున్న పుస్తకాలు విడిపెట్టెలో పెట్టాడు. గుడ్డల పెట్టెతెరచి సర్ది సాగాడు. ఇంతలో గదితలుపు తట్టినట్లయి తలెత్తి "ఎవరది?" అని అడిగాడు. సమాధానం రాలేదు. గొళ్ళెం చప్పుడుమాత్రం వినిపించింది.

"ఎవరది? తలుపు తీసేవుంది."

"అన్నాయ్"

తలుపు మెల్లగా తెరుచుకొన్నది.

"నువ్వా, ఎప్పుడువచ్చావు!"

రామారావు పెట్టెమూసి దానిమీద కూర్చోమని తాను కిటికీలో చతికిలబడ్డాడు. సీత గదిలోకివచ్చి నలుమూలలు పరకాయించి చూచి "మూట ముల్లె సర్దుతున్నట్లున్నది. గది మారుస్తున్నావా ఏమిటి? కొంపదీసి రేపువస్తే కనిపించేవాడివే కాదన్నమాట" అన్నది.

"నిలబడ్డావు దేనికి. కూర్చో. ఇంటిదగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా? అమ్మా, నాన్నా, అందరూ బాగున్నారటగా?"

"అంతా బాగానే ఉన్నారు. సరే కాని గది ఇంత తొందరలో మార్చవలసిన అవసరం ఏమొచ్చింది?" సీత పెట్టెమీద కూర్చుంటూ అడిగింది.

"గది మారుస్తున్నానని ఎవరు చెప్పారు?"

"మరి ఎక్కడికన్నా వెళ్ళుతున్నావా?"

రామారావు సిగరెట్టు ముట్టిస్తూ ఔనని తల ఊపాడు.

"ఎక్కడికి?"

"ఎక్కడికి వెళ్ళుతాను? ఇంటికి"

"ఇంటికా-నిజమే? పట్టిది. అబద్ధ మాడుతున్నావు. ఇటు తిరిగి చెప్పు. అన్నాయికి ఈమధ్య అబద్ధాలు కూడా పట్టుపడుతున్నట్లున్నవే."

"అబద్ధాలు యెవరికి పట్టుపడ్డాయో తెలుస్తూనే ఉన్నది."

"అన్నాయ్, నిజంచెప్పు! ఇంటికేనా? సంవత్సరన్నర పైగా ఇంటిముఖం చూడనినువ్వు ఇవ్వాళ ఇంటికి వెళ్ళుతున్నావంటేఎలానమ్మేది?"

"నాన్నగారు ఉత్తరం వ్రాశారు?"

"ఏమని?"

రామారావు చెల్లెలివంక నిదానంగా చూస్తూ అన్నాడు.

"ఏమనేముంది? పెండ్లి నిశ్చయమైంది. వెంటనే రావలసిందీ అని"

"పట్టిది. పట్టిది. నాకు వ్రాయందే."

"పెండ్లి నిశ్చయించుకొన్నది నీకానా కాని?"

"అయితే మాత్రం? పిల్లను నేను చూడకుండా పెండ్లి జరుగుతుందా? మాటమాత్రం నాన్నగాని, అమ్మగాని నాకు వ్రాయకుండా ఉంటారా?"

"పెండ్లి చేసుకొనబోతున్నది నేను. నీకేమిటి సంబంధం? నాకిష్టమైనది, నేను చేసుకోబోతున్నాను. మధ్య నీపెత్తన మేమిటి?"

"చూస్తాగా యెలా చేసుకొంటావో!"

"ఎలా చేసుకోనే దేముంది? పురోహితుడు మంత్రాలు చదువుతాడు. మూడుముళ్ళూ పడతాయి. అంపకాలు అవుతాయి. ఇంటికివస్తాం. వాకిట్లో సీత హారతి పడుతుంది."

"సీతఅంటే చేయమన్న పనల్లా చేయటానికి దాసీదికాదు."

"నేనూ అదే అనుకొంటున్నాను."

"ఏమని?" సీత గద్దించింది.

"దాసీదికాదు. మంచి చెడ్డలు తెలుసు. ఆత్మగౌరవం ఉన్నది. దాన్ని నిలుపుకొని తీరుతుందీ అని."

"ఇదంతా చూడగా చూడగా కళాకోళంగా కనిపిస్తున్నది. నేనే మంటానో తెలుసుకొందామని అంటున్నావు. అన్యాయ్ నిజం చెప్పు. నిజమేమంటే మా వార్డెన్‌కు చెప్పి వెంటనే నేనుకూడా వస్తా" సీత ఆర్ద్ర నేత్రాలతో అన్న వంక చూచింది.

"వట్టి పిచ్చిపిల్ల!"

రామారావు నిట్టూర్చాడు. తండ్రిచేస్తున్న అన్యాయం చెల్లెలికి చెప్పటమా లేదా అన్న సందేహం కలిగింది. చెప్పకపోతే నొచ్చుకుంటుంది. చెప్పితే బాధ పడుతుంది. అనవసరంగా మరొక జీవిని ఎందుకు కష్టపెట్టాలి? ఏదో మాటచెప్పి పంపించవచ్చును. కాని అది అతని కిష్టంలేదు. పైగా తన్ను సానుభూతితో అర్థం చేసుకునే వ్యక్తి ఒకరైనా ఉండాలని అతనికి అనిపించింది. అలాటి వ్యక్తి లేకపోతే వచ్చే నష్టమేమిటో అతనికి తెలియులేదు. అందువల్ల ఉన్నది చెప్పవేయటమే మంచిదేమోనని ఆలోచిస్తూ ఉన్నాడు. ఆ సంగతి సీత పసికట్టింది. లేచి వెళ్లి తల నిమురుతూ అడిగింది, "ఎందుకు నాదగ్గర దాస్తావు? పరాయి దాన్నా? నమ్మరానిదాన్నా? అసలు సంగతేమిటో చెప్పవూ?"

రామారావు మెల్లగా చెప్పాడు. "చంద్రశేఖరం పోర్జరీ చేయలేదు. నాన్న నిజంగా అతనికి హామీ ఉన్నాడు. ఆ సంగతి నాన్నే నోటి మీదుగా నాకుచెప్పాడు. ఇప్పుడు నాన్న ఎందుకు కేసుపెడుతున్నాడో తెలియటం లేదు. పొరపడి ఈపనికి దిగటానికి వీలులేదు. నేను జ్ఞాపకం చేస్తూ ఉత్తరం రాశాను. 'ఈసంగతి నీకేమీ తెలియదు. కాబట్టి మొదలు నుండ ఊరుకోవటం ఉత్తమం. ఇప్పట్లో నీవు ఇక్కడకు రావద్దని మీఅమ్మ

కూడా చెప్పమంటున్నది' అని సమాధానం వ్రాశాడు. ఎలాగైనా సరే నాన్నచేత కేసు ఎత్తివేయించటం అవసరం. కాలం గడిచిపోతే తరువాత అనుకొని లాభంలేదు."

ఆమాటలు వినగానే సీత పిడుగడిచినట్లే కూలబడ్డది. కళ్ళు చూస్తూనేఉన్నవి కాని ఏమీ కనిపించటంలేదు. ఐదునిముషాలు అలాగే నిశ్శబ్దంగా గతించాయి. రామారావుకూడా మాట్లాడలేదు.

"అన్నాయ్!" గద్గద కంఠం పలికింది. ఎడమ చేతి చిటికెన వ్రేలు కడకంట జారిన అశ్రుకణాన్ని తొలగ మీటింది.

"సీతా! నువ్వు అనబోయే మాట తెలుసు. హామీ ఉన్నట్లు నాన్న నాతో చెప్పి ఉండడు, నేను పొరబడుతున్నాను - అని నీసందేహం. అంతేనా ?"

సీత ఔనని తల ఊపింది.

"మొట్టమొదట నేనూ భ్రాంతి పడ్డానేమోనని ఆలోచించాను. ఇందులో పొరపడలేదు. నాన్నమీద నాకు కోపం దేనికి? నువ్వేచెప్పు. కోపం ఉంటే తనకు తెలియకుండానే నా మనసు ఇలాంటిదాన్ని సృష్టించటానికి అవకాశం ఉన్నది. కోపం లేదు. ఉంటే చంద్రశేఖరం పక్షాన సాక్ష్యంచెప్పి ఆయనను జైలుకు పంపించాలి. ఆయనను జైలుకు పంపించాలని కలలోకూడా అనుకోటంలేదు. ఎలాగైనా అసలు ఈ కేసు రొత్తివేయించాలని ఆతురతపడుతున్నాను. పైగా ఈ హామీ సంగతి అమ్మకు చెప్పవద్దని కూడా ఆనాడు నాతో స్పష్టంగా చెప్పాడు. ఆమాట ఈనాటికీ చెవులలో గింగురుమంటూఉంది. ఇదికూడా నా మనస్సు కల్పించిందే నంటావా? లేదు సీతా లేదు. తండ్రిమీద నీకున్న భక్తి, నీ భావిజీవితం ఏమైపోతుందోనన్న భయం, ఈ శంకను కలిగిస్తున్నాయి. అంతకుతప్ప మరేమీ లేదు."

"అంతేనా !"

"అంతే. ఇప్పుడు ఎలాగైనా కేసు ఎత్తివేయించటం ప్రధానం. అందుకోసమే యీ ప్రయాణం. ఆ తరువాత ఎలా జరగవలసి ఉంటే అలా జరుగుతుంది. శక్తిమించి వచ్చినప్పుడు ఎవరేమి చేస్తారు? సీతా, నువ్వేమి దిగులు పెట్టుకోకు. అనవసరంగా మనస్సు చెరచుకొని చదువు పాడుచేసుకోకు. దిగులుపడితే వచ్చే ప్రయోజన మేమన్నా ఉంటే దిగులు పడవచ్చు.

అలాంటి ప్రయోజనమేమీ లేదు. నేనుపోయి స్థితిగతులు తేలగానే ఉత్తరం వ్రాస్తాను. బెంగపెట్టుకోకు."

సీత మెల్లగా లేచింది. రామారావు బలవంతపెట్టి ముఖం కాళ్ళు, చేతులు కడిగించి చెల్లెల్ని టాక్సీలో హాస్టలువద్ద దించి తాను ఆ నాడే మెయిలులో ఇంటికి బయలుదేరాడు.

## 13

"ఊరగపొద్దన్నా తెంకలేదు. అప్పుడే నిద్ర ఎలావస్తుందో మనిషికి!"

"ఏమిటీ చెవికింద నసుగుడు! మెదలకుండా పడుకో."

"నానిద్ర కాస్తా కాజేసి గుర్రుమంటున్నారా? న్యాయమంటే అలా వుండాలి!"

"నీకు కాదా చెప్పేది?"

"అబ్బబ్బ దోమలు. నన్నేమి చేయమంటారు?"

"గట్టిగా ముసుగు పెట్టుకోండి సరి."

"పోయించిన చెమట చాలదనా?"

"ఎవరు పోయించారట?"

"ఇటుచూచి మాట్లాడాలి. అటుతిరిగి అంటే ప్రయోజనం!"

"ఎలాగైనా నిద్ర చెడగొట్టటానికి యత్నం. ఎవరికి తెలియదంటావూ? ...మనిషి అన్నతరువాత జ్ఞానం ఉండాలి."

"అదేమిటండోయ్! ఛీ, పాడుఎలుకలు. బ్రతికిఉండగానే కొరుక్కుతినేట్టున్నాయి."

"అదే రెండు కాళ్ళ ఎలుకలు!"

"నామాటపట్టదైతే ఎదురుగా నేనుండగా చూడు. చూడండి. ఒకటి, రెండు, పది-అసలు ఇల్లంతా ఎలుకల మయమేనట్లుంది. నిజంగా కొరుక్కుతినవుగందా."

"అరే! ఇన్ని ఎక్కడినుంచి వచ్చాయి? విచిత్రంగా ఉందే."

"మరేమనుకొన్నారు! ఎదురు బెదురు ఉంటేమో చూడండి. మీద పడవుగదా కొంపదీసి!"

"సరే కాని పొగమారు కంపు కొడుతున్నదే!"

"మీకు అంతా వాసనే!"

"కాదు. ఏదో వాసన వస్తూ ఉంది."

"అవి దవడలు కటకటలాడిస్తూ ఉంటే, ఒళ్ళు గత్తరపొడుస్తూ ఉంది. కాస్త తోలండి!"

"రాణీగారు ఆజ్ఞ ఇచ్చిన తరువాత తప్పేది ఏముంది?"

"ఇస్ అబ్బా! ఇదేమిటి మళ్ళా మేళాం?"

"తోలమన్నావుగా? ఎక్కడో మూరుమీద ఉన్నవి. యెలా పోతాయి?"

"మీరు తోలవద్దు పెట్టవద్దులే ఊరుకోండి పిల్లవాడు లేస్తాడు."

"అంతా నీ యిష్టమేనా?"

"అబ్బబ్బ, అసలు బుద్ధితక్కువ తనమంతా నాదే. నిద్రపోతున్న వాళ్ళను ఎందుకు లేపాలి?"

"అవి ఇంకా పోవటంలా?"

"అయ్యో, అయ్యో! మంటలు, మంటలు!"

"అంతా పట్టిందే."

"అమ్మో, అమ్మో! ఇల్లు... ఇల్లు ... అంటుకొన్నది...మీకే చెప్పేది."

"సత్యనారాయణగారూ సత్యనారాయణగారూ! కొంప ముట్టుకొన్నది. ఏమండోయ్! ఇంకేముంది; తలుపు తియ్యండి." తలవాకిలి యెవరో దబీదబీ గుద్దుతున్నారు.

పద్మ సత్తువకొంచకే సత్యనారాయణను ఒక త్రోపు త్రోసింది. అతడు అంతదూరాన పడ్డాడు "అయ్యో నాబిడ్డ నాబిడ్డ" అంటూ దూరంగా చిన్నమంచంమీద నిద్రపోతున్న వాణ్ణి చంకను వేసుకొని బయటకు దూకింది. వీథి తలుపు మోగుతూనే ఉంది. మంటలు నడికప్పుకు అందుకొంటున్నాయి.

ఇల్లంతా పొగ కమ్మసాగింది. అప్పటికి సత్యనారాయణ బాహ్యజగత్తులో పడ్డాడు. గబగబా పడమటింటిలోకి పరిగెత్తాడు. పద్మకు భర్త కాని, పెద్ద కుర్రవాడు కాని కనిపించలేదు. పెద్ద పెట్టున ఏడుస్తూ తలవాకిలి తీసి వాళ్ళ నిద్దరినీ కాపాడండని మొత్తుకోసాగింది. మూగిన పదిమందీ ఒక్కసారిగా లోపలికి నెట్టుకువచ్చారు. ఈ లోపున సత్యనారాయణ పెద్దకొడుకుతో ఇంట్లోనుంచి బయటపడ్డాడు.

ఈ గల్లంతుకు చుట్టుపట్ల ఇళ్ళవాళ్ళంతా మేలుకొన్నారు. పూరిళ్ళ వాళ్ళు ఇంట్లోసామాన్లుతీసి దొడ్లో పడవేయసాగారు. వచ్చిన వాళ్ళంతా శక్తివంచనలేకుండా ఆర్పటానికి ప్రయత్నించారు. కాని దగ్గర్లో నీళ్ళు లేక పోవటం, పొగచుట్టవేయటంవల్ల వాళ్ళేమీ చేయలేకపోయారు. కాకపోతే మంటలు ప్రక్కపూరిళ్ళకు ముట్టుకోకుండా ఆపగలిగారు.

పిల్లలు, భార్య, సత్యనారాయణ, నివ్వెరపోయి చూస్తున్నారు.

"ఎలా ముట్టుకొన్నది?" అని ఒక పెద్దమనిషి అడిగాడు.

"ఏమి చెప్పకొంటే తీరుతుంది? మా కర్మ అలా నెట్టుకు వచ్చింది" అన్నాడు పంతులు.

పద్మ వెక్కి వెక్కి ఏడవసాగింది. "మామగారుపోయారనిఏడుస్తూ ఉన్న కంటి తడన్నా ఆరలేదు. ఈ వడిముట్టుకూడా వచ్చిపడ్డది. ఓరి భగ వంతుడా ఇంటి దారిద్ర్యంకూడా తెచ్చిపెట్టావా? మే మేమిపాపం చేశాము?"

"ఊరుకో అమ్మా ఊరుకో. అయిపోయిన దానికి ఏడ్చిలాభంలేదు. ఇంకా నయం-మీ నాలుగు ప్రాణాలు దక్కినాయి. లేకపోతే ఏముంది?" అన్నది పొరుగు బ్రాహ్మణి.

"ఎవరో దుర్మార్గులు కావాలని పెట్టిన పనేకాని చేతప్పవల్ల ముట్టుకోలేదు" అని ఒక ముసలాయన అన్నాడు.

"ఎవరెందుకు పెడతారు? పంతులికి ఊళ్ళో పగ ఏమున్నదికనక!" అని మరొకరన్నారు.

"కాదు. ఎవరో చేసినపనే. ఊళ్ళో బొత్తిగా మాద్దపద్దూ లేకుండా పోతున్నది. ఈ బుద్ధులతో తొందరగానే బాగుపడుతుందిలే. చూడమ్మా

అప్పుడే అయిందా! పిదప కాలంవస్తే సరి తక్కూమాతి పిందెలు పుడ తాయి" అన్నాడు ముసలాయన.

ఇల్లు చల్లారిన తరువాత ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. కావాలని ముట్టించారని కొందరూ, కాదు ఏదో పొరపాటువల్ల జరిగిందని కొందరూ వాదించారు. ఏది ఎలాజరిగినా, పంతులు ఇల్లుమాత్రం తగులబడిపోయింది. ప్రాణాలు కట్టుకొన్నగుడ్డలు తప్ప మరేమీ మిగలలేదు.

ఆరాత్రి కాకాత్రే యీవార్త పుల్లయ్యవిని ఆదరాబాదరా పరుగెత్తుకొనివచ్చి ఓదార్చాడు. దిగులుపడవద్దనీ, తానుఉండగా భయపడ వలసిన పనిలేదనీ హెచ్చరించాడు. ఇంతలోనే డాక్టరుకూడావచ్చాడు. అంతా పక్కవాళ్ళు చెబితే విని నిట్టూర్చాడు.

"సత్యనారాయణ! దిగులుపడి చేసేదేమున్నది. ప్రాణాలుదక్కాయి. అదే పదివేలు. గొంతులో ఊపిరేఉండాలిగాని ఇలాంటిఇళ్ళు పది సంపాయించుకోవచ్చును. మా యింటికి వెళ్ళుదాంపదండి. లేవమ్మా లే. కష్టాలు దొవరికైనా వచ్చేవే. మీ యిష్టం వచ్చినంతకాలం మాయింట్లో ఉండురు కాని. సందేహం దేనికి?"

"ఈ నాలుగురోజులుపోతే ఇల్లురాక ఏమిచేస్తుంది? లే పంతులూ లే" అని పుల్లయ్య హెచ్చరించాడు.

పంతులు డాక్టరుమాట, పుల్లయ్యసలహా త్రోసివేయలేక భార్యా పిల్లలతో అతని యింటికి వెళ్ళాడు.

## 14

పంతులుయిల్లు తగలబడిన మూడోరోజున కుశాలయ్య - పుల్లయ్య ఇంటికివచ్చాడు. అప్పుడే పుల్లయ్య చుట్టకాల్చుకుంటూ పడకకుర్చీలోపండు కొన్నాడు. పంతులు యెప్పటిచోటకూర్చుని పద్దులుఏవో వ్రాస్తూఉన్నాడు.

"ఏం కుశాలయ్యా, బొత్తిగా కనిపించటం మానేశావే!" అని చూడగానే పుల్లయ్య కూర్చుని పలకరించాడు.

"పనులుకొంచా. కొత్త సందు దొరుకుతుందేమో వద్దామంటే పడ కొచ్చింది." కుశాలయ్య పరచిఉన్న చాపవదలి వట్టి గచ్చుమీద కూర్చున్నాడు.

"చాపమీదకూర్చో-క్రిందదేనికి? భోజనం అయిందా?"

"ఆఁ, అయింది. ఏపాటుతప్పినా సాపాటు తప్పదుగదా! ఐతే పంతులుగారూ, మొన్న ఇల్లు కాలిపోయిందే. పొరపాటువల్ల జరిగిందా, లేక యెవరైనా పెట్టించరంటారా?"

"ఏమిచెప్పేది మరాలయ్యా! ఇంతకూ కర్మ అలా పెట్టుకు వచ్చింది."

"పులిమీద పుట్ర అన్నట్టుగా తండ్రిగారు కాలంచేసి నెలరోజులు కాకముందే యిదొకటి వచ్చిపడింది. ఇంతకూ రోజులు బాగున్నట్లు లేదు పంతులుగారు. తెలిసికూడా యెలా ఊరుకున్నారు? శాస్త్ర శాంతి చేయించుకోక పోయారా?"

"రోజులు బాగుండలేదని నాకుమాత్రం తెలుసా?"

"అదేమిటండీ షావుకారు మల్లయ్యతో అన్నారంటగా. కచ్చేరి అరుగువద్ద ఆయన అన్నాడు."

"అలాగా. ఆఁ. ఆఁ గుర్తుకు వచ్చింది. ఏదో మాటవచ్చి అన్నాను. ఆయనకు ప్రతిమాట జ్ఞాపకమే నన్నమాట!"

"ఆఁ జ్ఞాపకం ఉండకేఁ! అవసరం వచ్చినవన్నీ జ్ఞాపకం ఉంటాయి. అవసరం లేనివన్నీ అడుగున బడిపోతాయి. షావుకార్ల తరహామే అంత."

"ఏదో వినయతున్నావే ఏమిటి సంగతి?"

"పంతులుగారూ! ఆనాడు గడ్డి, మినుములు అమ్మితే వచ్చిన పైకం ఎంతండీ? మీ చేతనేకదా లెక్క పెట్టించింది."

"అవును. మూడు నూరు కాగితాలు, పద్ధెనిమిది అయిదులు, పది ఒకట్లు. మొత్తం నాలుగువందలూ మల్లయ్యగారికి ఇవ్వాలని తీసుకు వెళ్ళావు."

"వెళ్లి ఆయనచేతులో పోశాను. 'తాళంచెవులు దగ్గరలేవు. సాయంకాలంవచ్చి నోటు తీసుకువెళ్ళ'మంటే పెద్దమనిషికదా అని ఆపాట తిరిగి వచ్చాను. ఇవాళ పొద్దున్నే వడ్డీతాలూకు మన్నెండు రూపాయలు పట్టుకెళ్ళి నోటు అడిగితే, అసలు ఇవ్వందే నోటు ఎలావస్తుంది-అని అడిగాడు. ఇంకా మాట్లాడేదేముంది? రెండూమూసుకొని చక్కావచ్చాను. అంతలో ఉంది న్యాయం పంతులుగారు!"

"అంతపని చేశాడా?"

"లేదు. నేనే అబద్ధమాడుతున్నాను. గొడ్లకు మేత ఉంటుందా లేదా అనకుండా గడ్డి అమ్మినందుకు తగిన ప్రాయశ్చిత్తం జరిగింది. జరగదూ మరి? వాటి ఉసురు ఊరికినే పోతుందా? ఎంతకు ఒడిగట్టాడు! చూస్తానుగా. నా ఉసురు తగలకుండా ఉంటుందీ? అతడు ఈ నాలుగు వందలతో బాగుపడతాడూ? పైన దేవుడులేడూ? అన్నీ చూస్తూనే ఉంటాడు."

కుశాలయ్య మాట్లాడలేకపోయాడు. పంతులు, పుల్లయ్య, కొయ్య బొమ్మలై పోయారు.

"పుల్లయ్యగారూ, అయినదేదో అయింది. ఒకసారి మోసపోతాను గాని జీవితమంతా మోసపోనుగందా. మల్లయ్యగారికి బాకీఉన్నదనిపించు కోటం నాకేమీ యిష్టంలేదు. అసలు బాకీపడటంకన్నా బుద్ధితక్కువపని మరొకటి లేదు. మీకు డబ్బు అవసరమే. పంతులుగారి ఇల్లు వేయించాలంటే ఎటులేదన్నా వెయ్యిరూపాయలు కావాలి. అయినా నాకుకూడా ఈ కాస్త సాయం చేయండి. నాలుగువందలు ఇస్తే అతనిమొఖాన పారవేసి వస్తాను. ఈ నాలుగువందలుకూడా నాకు అప్పుగా ఇవ్వవద్దు. కోడె దూడ గల్లి ఉంది. ఈనమోసిన గేద ఒకటి ఉంది. నాకు మేపటానికి గడ్డి కూడా చాలదు. ఇప్పుడే తీసుకొచ్చి మీదొడ్లో కట్టివేస్తాను."

"అదేమిటి కుశాలయ్యా, అంతా మల్లయ్య లాంటివాళ్లే ఉంటారా? నాకా భయం ఏమీలేదు. నాలుగువందలూ తీసుకువెళ్ళు. మెసలాయింపు ఉన్నప్పుడే ఇద్దువుగాని. ఆవునూ, గేదనూ అట్టిపెట్టుకో, వాటిని దొడ్లో కట్టేస్తానంటే మాత్రం ఊరుకోను. అరే జగ్గాయ్! అమ్మను అడిగి నాలుగు వందలు పట్టుకురారా?" పుల్లయ్య కేక వేశాడు. కుశాలయ్య లేచాడు.

"లేస్తున్నావే డబ్బు తీసుకుపో."

"అప్పువద్దు పుల్లయ్యగారు! ఆమాత్రం నమ్మకం ఉంటే అదే చాలు."

కుశాలయ్య బయలుదేరాడు.

"నీమతిమే నీదా? కాస్త ఆలోచించుకో! డబ్బు తీసుకువెళ్ళి ఆవు గేద అమ్ముకుపోగానే ఇచ్చివేయి. ఎవరు కావన్నారు? నాకు వడ్డీ కూడా ఇవ్వవద్దులే."

"గొడ్లనుకట్టివేసుకుంటే నాకుడబ్బుఇవ్వండి. లేకపోతేనాకువద్దు."

"సరే నీయిష్టం వచ్చినట్లే కానీ" అంటూ జగ్గారావు పట్టుకువచ్చిన నాలుగు కాగితాలు అతని కిచ్చాడు.

కుశాలయ్య పోయింతరువాత పుల్లయ్య పంతులుతో అన్నాడు:

"మల్లయ్య ఇంతదగుల్బాజీ పనికి ఎందుకు దిగినట్లు?"

"అదే విచిత్రంగా ఉంది. ఇలాంటి పనులు నాయెరిగినంతలో ఎప్పుడూ చేయలేదు"

"అయితే యిప్పుడు మల్లయ్య, చంద్రశేఖరం జోస్తీగా ఉంటున్నారటగా?"

"నేను చూడలేదు. వినలేదు."

"తెలుసుకోవటం అవసరం పంతులు. లేకపోతే మనం దేశాల మీద పోవలసిందే."

"అలాగే ప్రయత్నిస్తాను."

తరువాత రెండురోజులకు మల్లయ్య ముప్పై ఎకరాల గడ్డివామి తగలబడిపోయింది. పుల్లయ్య పంతుల్ని అడిగాడు.

"కుశాలయ్య పనేఅయివుంటుందని మల్లయ్యగారు అనుకొంటున్నారట. అనుకోవటమే కాదు. ఒకరిద్దరి దగ్గర అన్నాడట. ఆమాట విని కుశాలయ్య ఇవాళవచ్చి ఆయనవద్ద ఉండగానే ఆరోజున తాను ఊళ్ళోనే లేననీ, బంధువులను చూడటానికి పోయాననీ రుజువిప్పించాడు. బిడ్డా గొడ్డూ ఉన్నవాడెవ్వడూ ఇలాంటిపని చేయడని చెడా బడా తిట్టాడట."

"అబ్బెబ్బె. కుశాలయ్య ఎప్పుడూ అలాంటివాడు కాదు. పాపపుణ్యాలకు జంకేమనిషి. అతడు ఈ దౌర్భాగ్యపుపని చేస్తాడంటే నమ్మటానికి వీల్లేదు."

"అదే. అయోమయంగా ఉంది. ఏ దరిద్రుడు చేశాడీపని?"

"లేదు పంతులూ. ఊరు పూర్తిగా కట్టు దప్పిపోయింది. ఎవర్ని ఏమి అనటానికీ వీలులేదు. అంటే ఏ నిమిషాన ఎవరికొంపకు నిప్పు పెడతాడో! ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని బ్రతకాలిసిన రోజులువచ్చాయి. కానీ ఎంతవరకు జరగాలో అంతవరకూ జరుగుతుంది"

"ధర్మంలేనప్పుడు అంతగాక మరేముం"దని, పంతులు నిట్టూర్చాడు.

# 15

ఒక రాత్రివేళ డాక్టరు వాసుదేవశాస్త్రి లఘుశంక తీర్చుకుందామని తలుపుతీసుకొని బయటికివచ్చాడు. వీధిఅరుగుమీద ముసుగుపెట్టుకొని కూర్చున్నవ్యక్తి కనిపించాడు. డాక్టరుగుండె దడదడ కొట్టుకొన్నది. శాస్త్రి సంబాళించుకొని 'ఎవరది' అని అడిగాడు.

"నేనేనండి దొరగారు. పోలాయిని" పోలయ్య లేచి నిలబడ్డాడు. చేతిలోకర్ర జారిపడి మోగింది.

"ఇంకామీకు ఎప్పటికి బుద్ధివస్తుంది?"

"ఎందుకు కోప్పడుతారు దొరగారు? నేనేం తప్పుచేశాను?"

"అదిగో ఆమాటే అనవద్దని ఎన్నిసార్లుచెప్పాను ? ఎవరుదొర? నా మోచేతిక్రింది నీళ్లుతాగి బతుకుతున్నారా ? నేను పోషిస్తున్నానా ? నీ రెక్కలకష్టంతో బ్రతుకుతున్నావు. ఎవరిగొప్పతనం వాళ్లది. మళ్లీదొర అన్నావంటే అన్ని మందునీళ్ళుకూడా ఇవ్వను తెలిసిందా?"

"అలవాటు చొప్పున వత్తదిబాబు. ఈరోజున పోవాలంటేపోద్దా?"

"పోలయ్యా!"

"ఏమిబాబు?"

"నిలుచున్నావు లేచి ఇటువచ్చి కూచో!"

"ఇక్కడ కూకుంటాలేండి."

"పదిరెండురోజులనుంచి ఇక్కడకువచ్చి పండుకొంటున్నట్లున్నది"

"ఇక్కడే పండుకొంటున్నానండీ!"

"పండుకోవలచిన వాడివి చాప అడిగితే కాకపోయిందా?"

"నాపరాతి అరుగు చల్లగా ఉంటాది. పైగా మిమ్మల్ని లేపాలి"

"నిజంచెప్పు పోలయ్యా. పెళ్లాముతో పోట్లాడావా? లేక పాట్లో తగవులేమైనా వచ్చాయా ? ఎన్నడూ రానివాడివి ఇక్కడికివచ్చి ఎందుకు పండుకొంటున్నావు? ఊళ్లోనే పండుకో దలచుకుంటే పెద్దఆసాముల అరుగులు చాలా ఉన్నాయే."

పోలయ్య మాట్లాడలేదు.

"మాట్లాడవేం? పాట్లో వాళ్ళు ఎవళ్ళయినా కత్తుకట్టారా?"

"పోలాయిమీదనా? పాట్లో నాయాళ్ళకు అంతదమ్ములున్నాయా?" అతడు వెకిలిగా నవ్వాడు.

"మరి!"

"ఊళ్ళో జూదవబుద్ధులు పుట్టాయ్. రోజు యాడో ఒకచోట ఏదో ఓటి తగలడుతోంది. అంచాత ఏగడియన ఏమిజరుగుద్దో అని యాదకు వచ్చేసి పండుకొంటున్నాను బాబు"

డాక్టరు పెద్దగా నవ్వాడు.

"పోలయ్యా నీవంటి వెర్రిమనిషి మళ్ళీ పుట్టడు. నాయిల్లు తగలబెడితే ఏమి ఒరుగుతుంది?"

"అలా అనకండి బాబుగారూ. ఏమివచ్చిపడద్దని ఇళ్ళు,వాములు తగలెట్టుకొంటున్నారు? మొన్న గత్తె మొన్న ఆశ్శ్వారం కాత్తా తగలపెట్టారా. వాళ్ళఒళ్ళో ఏమొచ్చిపడ్డది? కోపాలు, పార్టీలు అలా అనిపిత్తాయి బాబు"

"మందులిచ్చి బ్రతికేవాడికి నాకేమిటోయ్ పార్టీలు. నామీద ఏమి సాధిస్తారు?"

"మీకు అలాంటిబుద్ధి ఉంటే ఈపాడూళ్ళో యెందుకు పడివుంటారు? మీబుద్ధి అందరికీ ఉంటదా? మీలాంటివాళ్లు యెక్కడనన్నా ఒకరుంటారు. ఉన్నా మంచి తెలుసుకోలేరు. లోకమంతా తమలాగా గడ్డితింటుందనుకుంటారు. ఎందుకైనా మంచిది అ..." అతడు కిటికీవైపు చూచాడు.

"సందేహం దేనికి? ఫరవాలేదు కానీ"

"అఁ ఏమీలేదు. ఆపంతుల్ని తీసుకొచ్చి యెందుకు ఇంట్లో పెట్టారు బాబు-తొందరగా అవతలికి పంపించెయ్యండి."

"అనేమి పోలయ్యా! ఇల్లుపోయి అల్లాడుతూఉంటే నాలుగునాళ్ళు తలదాచుకోండని తీసుకువచ్చాను. ఇదికూడా తప్పేనా! ఇవాళ ఇది తప్పు అయితే రేపు ఊళ్ళోఉండటంకూడా తప్పేఅవుతుంది. ఇలా చూస్తూఊరుకొంటే లాభంలేదు. అర్థమౌతుంది పోలయ్యా! నీమేలు యెప్పుడు మరచిపోను. వేరే అనుకోక నువ్వుపోయి నీయింట్లో పడుకో. ఇక్కడ కాపలా వద్దు. ఎంత కాలం ఇలా బ్రతికేది?"

"మీకేం, మీరు మా బాగా చెబుతారు. పోతే మీ యిల్లే కాదు. మందులన్నీ పోతాయి మా బీదాళ్ళకు మరి దిక్కేమిటి? ఆనాడు అన్ని మందు నీళ్ళుపోశారు కాబట్టి మా యింటిది యిన్ని గంజినీళ్ళు కాచి పోస్తోంది. అది ఊడిఉంటే గంపెడు పిల్లలు యేమైపోయేవాళ్ళు? మీరే మహాన్నా అనండి, మెడబట్టుకు గెంటండి. రాత్రిళ్ళు ఇక్కడనుంచి కదిలేది లేదు."

"పోలయ్యా నీకే చెప్పేది. వెళ్ళు!"

"మీరు నా గొంతుకోసినా నేను వెళ్ళేదిలేదు."

"నీవు వెళ్ళందే నేను ఇంట్లోకి వెళ్ళను" వాసుదేవశాస్త్రి అరుగు మీద చతికిలబడ్డాడు.

పోలయ్య అలాగే పావుగంటసేపు నిలబడ్డాడు. డాక్టరు కూర్చున్న పాటే కునుకుపాటు పడసాగాడు. "నేనే మొండినంటే నాకన్నా జగమొండివే బాబూ," అంటూ పోలయ్య పంతుల్ని కేకవేసి "డాక్టరుగారు బయటే పండుకొంటారట. కాస్త పక్క బయటవేయం"డని చెప్పాడు. వద్దు లెమ్మంటున్నా కొండికీ పడక డాక్టరుకు పక్క బయటవేసి పోలయ్య హెచ్చరికమీద లోపలి గడియవేసుకొని పండుకొన్నది. ఆరాత్రి యిద్దరికీ ఆ వీథి అరుగుమీదనే గడిచింది. తెల్లవారుతుండగా పోలయ్య గుట్టుచప్పుడు కాకుండా వెళ్ళిపోయాడు.

ఆనాటి దినపత్రిక తెరవగానే డాక్టరుకు తన ఊరివార్త పెద్ద శీర్షికతో కనిపించింది. ఆసక్తితో చదవ మొదలుపెట్టాడు:—

హరిజనాశ్రమ కార్యదర్శిని అయిన శ్రీమతి అనసూయమ్మగారు ఇలా వ్రాస్తున్నారు: "గత పదిరోజులనుంచి ఈ ఊళ్ళో కమ్యూనిస్టులు చెలరేగి ఇష్టంవచ్చినట్లు విధ్వంసక చర్యలు సాగిస్తున్నారు. ఇళ్ళకు వాములకు నిప్పుపెట్టారు, పెడుతున్నారు. హరిజన ఉద్ధరణకోసం పాటుపడుతున్న ఆశ్రమానికి నిప్పుపెట్టారు; ఈ చర్య ఏమనవలెనో తెలియటంలేదు. నిన్న రాత్రి ఒక ఆసామి యింటిపై దాడి చేసి ఉన్నడబ్బు అపహరించుకొని పారిపోయారు. ఇంతవరకు ఎటులేదన్నా గ్రామం మొత్తంమీద లక్ష రూపాయలవరకు నష్టపడింది. గ్రామస్థులు ఏ గడియకు ఏమి జరుగుతుందోనని హడలిపోతున్నారు. ప్రభుత్వంవారు ఎందుకు ఈ ఉపేక్షాభావం

వహిస్తున్నారో తెలియటంలేదు. వెంటనే మలబారు పోలీసుబలం పంపి బందోబస్తు చెయ్యిస్తేగాని ప్రజానీకం బ్రతకలేదు. ప్రజాప్రభుత్వం తన బాధ్యతను తప్పక నిర్వహిస్తుందని ఆశిస్తున్నాను.''

ఈవార్త చదవగానే శాస్త్రి విస్తుపోయాడు. మందుకు వచ్చిన వాళ్ళను త్వరగా పంపించివేసి తిన్నగా హరిజన ఆశ్రమానికి వెళ్ళాడు. అమ్మాయమ్మగారు ఆఫీసులో కూర్చుని ఏదో వ్రాసుకొంటున్నారు. డాక్టర్ను చూడగానే మందహాసం చేస్తూ ప్రక్కనున్న కుర్చీ చూపించి, ''దారి తప్పి వచ్చినట్లున్నారే!'' అన్నది.

''లేదు. దారితప్పి తిరిగే తీరిక కూడాలేదు. మీతో పనుండే వచ్చాను''

''అలాగా, కబురుచేస్తే నేనే అటు వచ్చేదాన్నిగా.''

''మీకుమాత్రం తీరికఉందా ఏమిటి? ఎన్ని పనులో! అందులో ఆశ్రమం పాకలుకూడా పోయే.''

''అవునండి! దుర్మార్గులు రెండు పాకలు తగలబెట్టివేశారు. భ్రాంతిగా హద్దూ పద్దూ లేకుండా పోతున్నది.''

''అవును, అవును.''

''ఈ సంగతే పేపరుకు కూడా వ్రాశాను, చూచారుగా''

''చూడబట్టే మిమ్మల్ని ఒకసారి చూచి పోదామనిపించింది.''

''అలాగా! వ్రాయటం మంచిదైందికాదూ? అధికారులకు కూడా వేరే స్టేట్మెంటు పంపించాను''

''మంచిపనిచేశారు. లోగట్టు ఏకొన్నారు(?) తెలుసుకొన్నారు. మీ ఆలోచన చాలాగొప్పదిసుమా. గ్రామస్థులు ఇక మీపేరుచెప్పుకొని బతుకుతారు''

అమ్మాయమ్మగారి బుద్ధి కూడా శరీరానికి ఏమాత్రం తీసిపోలేదు. నవ్వుతూ ''నాదేమిఉందిలెండి, ప్రజలకు ఉడతాభక్తిని సేవ చేదామని వ్రాశాను.'' అన్నది. తన మాటలు దున్నపోతుపై వర్షంగా పరిగణించినందుకు డాక్టరు తన్నుతానే అసహ్యించుకొన్నాడు,

''సరేకాని ఇంతవరకు లక్షరూపాయలఆస్తి నష్టపడ్డదా? నా గొడవలోపడి నేను చూడనేలేదు సుమా.''

"ఆఁ ఎక్కడిదీ! అంతా పదివేలకులోపుగ ఉంటుంది. కాస్త సంచలనం కలిగిద్దామని లక్షరూపాయలఆస్తి నష్టపడ్డదని వ్రాశాను."

"నిన్న ఏ ఆసామి యింటిపైన దాడిజరిగింది?"

అమ్మాయమ్మగారు తెల్లబోయింది. అంతలో నే తెప్పరిల్లుకొని చిరచిరలాడుతూ "మీకు సమాధానం చెప్పవలసిన అవసరం నా కేమాత్రం లేదు." అన్నది.

"అది కాదు, కేవలం తెలుసుకుందామని అడుగుతున్నాను. వేరే అనుకోకండి. మిమ్మ క్రాసుచేద్దామని రాలేదు. చేద్దామన్నా మీరుచెప్పేవారుకారు. కమ్యూనిస్టులే యీ దండగాలు తలపెట్టారన్నారే! నిజంగా కమ్యూనిస్టులే చేస్తున్నారా? ఎవరు ఆ కమ్యూనిస్టులు, నాకు తెలిసినంతలో ఈ ఊళ్లో ఇటీవలవరకూ అసలు రెండో పార్టీయే లేదే! బహుశః నా వైద్యంలోపడి ఉన్న స్థితిగతులు గమనించకపోయి ఉండవచ్చును. ఎవరా కమ్యూనిస్టు?"

"చంద్రశేఖరం మాటా ఏమనుకొన్నారు?"

"చంద్రశేఖరం కమ్యూనిస్టా? ఎవరుచెప్పారు? ఏమిటిరుజువు? అతడే ఈ ఊళ్లో దురంతాలకు కారణమా? అమ్మాయమ్మగారు, కాస్త ఆలోచించండి! అతడూ దేశంకోసం కారాగారవాసం అనుభవించి వచ్చినవాడే. అతడు పేదసాదలను ఉద్ధరిద్దామని ఫ్యాక్టరీపెట్టి నేటికి బుక్కాపకీరు అయ్యాడు. అతడు కమ్యూనిస్టా? ఒకవేళ అతనివల్ల పొరపాటేదైనా ఉంటే మందలించి చూడవలసిన బాధ్యత మనమీదఉంది. అప్పటికీ వినకపోతే అతనికర్మ అతను అనుభవించక తప్పదు. ఇంతవరకూ అలాంటి ప్రయత్నం మీ రేమీ చేయలేదు. చేయకుండానే 'కమ్యూనిస్టు' అని ముద్రవేశారు. అది అలావుంచి మీలాంటి దేశభక్తురాండ్రు ఉన్న గ్రామంలో దుర్మార్గులున్నారంటే మీకేమైనా గౌరవం ఉంటుందీ? మేము వట్టి చవట దద్దమ్మలం, మీరువచ్చి చక్కదిద్ది పొండని అశక్తతను చాటటంకాదా? పైగా మలబారు పోలీసుబలం పంపించాలని కోరారే, ఆలోచించే యీ పనిచేశారా? లేదు. మీరు ఆలోచించలేదు. పోలీసు జులుమంటే ఏమిటో అర్థంకాలేదు. ప్రజల్లో ఎలాంటి అసహ్యం రగులుకొంటుందో ఆలోచించలేదు. కేవలం ఉన్న అధికారాన్ని నిల

పెట్టుకోవటంకోసం అలా చేశారు. ఇదికూడా మీరు చేయాలని చేయలేదు. అనుకోకుండా చేశారు. ఈపొరపాటు దిద్దుకొంటూ పత్రికకు ప్రకటన పంపించండి. మీరు, నేను, ఊళ్ళో పెద్దలు కలిసి పరిష్కరించటానికి ప్రయత్నిద్దాము. మన సమస్యలను మనం పరిష్కరించుకోవాలి కాని మధ్య వాళ్లెవరు, వారిసహాయంకోరటం మనకు గౌరవప్రదంకాదు. శ్రేయస్కరం అంతకన్నా కాదు. కాబట్టి సవరణ ప్రకటనను ఇవ్వాళే పంపించండి,"

అమ్మాయమ్మగారు మాట్లాడలేదు.

"పొరపాట్లు అనేవి ఎవరికన్నా వుంటాయి. వాటిని గుర్తించి దిద్దుకోవటం పెద్దవాళ్ళ లక్షణం, తరువాత మీ యిష్టం. చెప్పవలసినబాధ్యత ఉన్నది కాబట్టి చెబుతున్నాను. వస్తానండి" అంటూ ఆమెనుండి వచ్చే సమాధానం వినకుండానే డాక్టరు చరచర వెళ్ళిపోయాడు.

అమ్మాయమ్మగారు జేవురించిన ముఖంతో అమ్మవారిలాగా అలాగే కూర్చుని ఉంది.

# 16

పొద్దు వాటారింది. రచ్చబండవద్ద, లైబ్రరీవద్ద పేకాటలు చాలించి ఉత్తరీయాలు దులుపుకొని ఒళ్ళు విరచుకొని ఇంటివద్ద పనిపాటలు చూచుకోటానికి బయలుదేరుతున్నారు. చంద్రశేఖరం ఇంటికి బయలుదేరిన వాసుదేవశాస్త్రికి విద్యార్థుల గుంపు యెదురైంది. ఇంతలేనివాళ్ళు అంతలేనివాళ్ళు దాదాపు రెండు వందలమందిదాకా అట్టలు, జెండాలు పట్టుకొని నినాదాలు పెడుతూ వస్తున్నారు. ఆ కేకలు దేనికో ముందుగా అర్థం కాలేదు. ఆరోజున సభ జరుగుతుందని కూడా తెలియదు. అందువల్ల సంగతి సందర్భాలేమిటో తెలుసుకుందామని వీథి ప్రక్కన నిలబడ్డాడు. మల్లయ్య కొడుకు గంగాధరం ముందు జెండా పట్టుకొని గొంతు చించుకొంటూ అరుస్తున్నాడు.

దేశద్రోహులు
అంతరించాలి.
గుండా చర్యలు
నశించాలి.

విప్లవం వర్ధిల్లాలి.
ప్రజాప్రభుత్వం
వర్ధిల్లాలి

మిగతావాళ్ళు అంటున్నారు. ఆ గుంపులో పుల్లయ్య మనమడు జగ్గారావుకూడా కనిపించగానే డాక్టరు మనస్సు పరిపరివిధాల పోయింది. ఏమిటి ఈ అన్యాయం? కడుపారతిని ఆడుకోవలసిన కుర్రవాళ్లే! ఏదిగులు చింతలేకుండా చదువుకోవలసినవాళ్లే! బుద్ధులు పెరగకుండా పశువులుగా, యంత్రాలుగా యెందుకు తయారుచేస్తున్నారు? పెద్దవాళ్ళ అవివేకం, అజ్ఞానం, ఆవేశం ఇలా తయారు చేస్తున్నవి. వీళ్ళనని ప్రయోజనమేమిటి? ఇలా తయారైనజాతి సత్యంసాధిస్తుందా? స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తుందా? లేదు. ఈ జాతికి ఇప్పట్లో ముక్తిలేదు" అనుకొంటున్నాడు.

"డాక్టరుగారూ! గుడివద్ద మీటింగుకు మీరుకూడా రావాలి," అని పుల్లయ్య కొడుకు కేకవేసి చెప్పాడు. విద్యార్థులు పోయింతరువాత శాస్త్రి నేరుగా చంద్రశేఖరం ఇంటికివెళ్ళాడు. బయట చిన్న పిల్లలిద్దరు దుమ్ములో ఆడుకొంటున్నారు నూనెముఖం యెరుగని జిబ్బితలలు, చినిగిపోయిన గుడ్డలు, చూడగానే అది చంద్రశేఖరం ఇల్లు కాదేమోనని అనుమానించాడు. కాని నిదానించి చూచింతరువాత అది అతని యిల్లేనన్న నమ్మకం కలిగింది. "మీ నాన్నగారున్నారా?"

"ఉన్నారు. లోపలికి పదండి. నాన్నగారూ నాన్నగారు! మీకోసం డాక్టరుగారు వచ్చారు" అని పిల్ల కేకపెట్టింది.

చంద్రశేఖరంచూచి, "డాక్టరుగారు దారితప్పి వచ్చినట్లున్నారే! రండి." అని పిలిచి చేయిలేని కుర్చీ చూపించాడు. శాస్త్రి జేబుగుడ్డతో ముఖం తుడుచుకుంటూ కుర్చీని చంద్రశేఖరంవంక ఎగాదిగాచూచాడు. శరీరం చిక్కి నల్లకప్పువేసి ఉంది. వెంట్రుకలు తెల్లబారిఉన్నాయి.

"అలా చూస్తారేమి? కాస్త చిక్కిపోయాను. అంతే ఈమిల్లుగొడవ, ఫోర్జరీకేసు...మనశ్శాంతిలేదు. పుల్లయ్యగారి పుణ్యమాఅంటూ పసిపాప ఈ మధ్యనే పోయింది."

"అలాగా, ఏమిటిజబ్బు? నాకు కబురన్నా చేయలేదే?"

"ఏమో, మీ సంగతి కూడా ఆ సమయానికి స్ఫురించలేదు. అయినా మీరు మాత్రం ఏమిచేస్తారు? శరీర వ్యాధికైతే మందిస్తారు కాని, మనో వ్యాధికి మందేమిస్తారు? అయినదేదో అయిపోయింది. ఇప్పుడు అనుకొని ప్రయోజనమేమిటి?"

'పసిపాప రోగంవచ్చి పోయినా పుల్లయ్యేనా కారణం?' అని డాక్టరు మనసులో అనుకున్నాడు.

"జీవితం అన్నాక కష్టసుఖాలుండకతప్పదు. బుద్ధిమంతులు సర్దుకు పోవాలి సరేగాని ఉత్తరీయం వేసుకో వెళ్ళదాము."

"ఎక్కడికి?" ఆశ్చర్యంతో చంద్రశేఖరం అడిగాడు.

"పనిమీద బయలుదేరి వెళ్ళుతున్నప్పుడు ఈ అడ్డు ప్రశ్నలు పనికిరావు. లే"

"ఎక్కడికో, ఏమిపనో తెలియకుండా బయలుదేరినా? బాగుంది. అయినా ఈనాడు నావల్ల కావలసినపనివుందంటే మరీ ఆశ్చర్యంగా ఉంది."

"ఆశ్చర్యమేముంది? నీవల్లనే నాకుపకారం కావాలి. బయలుదేరు."

"వేళాకోళమా?"

"వాసుదేవశాస్త్రి ఎప్పుడైనా వేళాకోళం చేసేమనిషి అనివిన్నావా? నా సంగతి నీకు తెలియనిదేముంది? పుల్లయ్యగారిదగ్గరకు ఒకసారివెళ్ళి వద్దాము. లే"

"పుల్లయ్యదగ్గరకా?" శేఖరం విస్తుపోయాడు.

"అవును. అక్కడికే."

పుల్లయ్యపంపితే తనదగ్గరకు డాక్టరు రాయబారం వచ్చాడని శేఖరానికి వెంటనే అనుమానం కలిగింది. "కోర్టులో తననేరం రుజువైతే శిక్షపడుతుందని పంపించి ఉంటాడు. లేకపోతే రాయబారం పంపించవలసిన అవసరమేముంది? బెట్టుసరిగా యెలాగైనా బయటపడదామని పంపించిఉంటాడు. ఆ పప్పులు నాదగ్గర యెందుకు ఉడుకుతాయి? శేఖరం అంటే అంత తేలిగ్గా పడిఉన్నాడనుకొన్నాడు కామాలు!" అనుకున్నాడు.

"డాక్టరుగారూ! మీరు చాలా పొరపడుతున్నారు. నేను అతని దగ్గరకు వెళ్ళవలసిన కర్మం నాకు పట్టలేదు. నావల్ల తప్పేఉంటే మీరు

చెప్పినట్లు ఆయనతో ప్రాధేయపడటం ధర్మం, తుచ్ఛాకోరు పనిచేసి నా మిల్లు, నా వ్యాపారం, నా ఆస్తి, నా ప్రతిష్ఠ అంతా ధ్వంసం చేసింది అతను. నేను కాదు."

"ఇదిగో చంద్రశేఖరం ! ఇటు చూడు. నీవు చదువుకొన్నవాడివి. సంస్కారమున్నవాడివి. ఇంతో అంతో ప్రజాసేవచేశావు. ఇంకా చేతనైనంతవరకూ చేస్తావు. కొంచెం విశాలదృష్టితో చూడు. తప్పు నీది అని కాని, పుల్లయ్యదని కాని చెప్పటంలేదు. అతడు పంపితే నేను రాలేదు. అసలు నేనిక్కడికి వచ్చిన సంగతికూడా అతనికి తెలియదు. ఇదంతా యెందుకు చెబుతున్నానంటే ఉన్నస్థితిగతులు చెప్పటానికే ! మీ ఉభయుల్లో యెవరిని మోసగించినా నాకు వచ్చే ప్రయోజన మేమిటి? అయినా నేను ఒంటరిగాణ్ణి కదా ? నాకు కావలసిందేముంది? అయితే యీ ప్రయాసంతా దేనికన్న సందేహం కలగటం సహజమే. మరొక వ్యవహారం అయితే నేను వచ్చేవాణ్నే కాదు. చెప్పితే అర్థంచేసుకోగల మనుషులని వచ్చాను. మీకు పుల్లయ్యగారికి కలతలు రావటమేమిటీ, ఈ ఊరంతా ఆగం కావటమేమిటి ? ఇందులో అర్థమున్నదా ? వేలకొలది కిమ్మత్తు చేసే వాములు, సంస్థలు తగులబడిపోతున్నాయే. దీనివల్ల మీకుగాని పుల్లయ్యగారికిగాని లాభం కలుగుతున్నదా ? లేదు. మధ్య అమాయకులు పేదలు నష్టపడుతున్నారు. ఏ గడియన యేమి జరుగుతుందో అని అల్లాడి పోతున్నారు. ఈ ఘోర దురంతాలన్నీ, నీవు చేయించావని కాని, ఆ పుల్లయ్య చేయించాడని కాని ఉద్దేశం కాదు. నిజానికి నీకు గాని, ఆయనకు గాని ఏమీ తెలియదు. ఆ సంగతి నాకు తెలుసు. మీ ఉభయులకూ తెలుసు. ఇలాంటి రాక్షసకృత్యాలకు మీరు యెన్నడూ వొప్పుకోరు. అయినా జరుగుతూనే ఉన్నాయి. ఎలా జరుగుతున్నాయి? మీ తగాదాను ఆసరా చేసుకొని దుర్మార్గులు - కాదు అజ్ఞానులు ఈపని చేస్తున్నారు. ఇలాంటిదానికి మీలాంటివాళ్ళు ఎప్పుడూ తావుయివ్వకూడదు. ఇవ్వరుకూడా. అది అలావుంచి కక్షలవల్ల ప్రయోజన మేమిటని? ఒండొరులకు హాని చేసుకోవటంకన్నా వచ్చేదేముంది? కాబట్టి నీలాంటి బుద్ధిమంతులు పగ తుడిచివేయటానికి యెప్పుడూ వెనుకంజ వేయరాదు. ఎవరివల్ల అయితేనేమి తప్పుజరిగింది. దాన్ని దిద్దుకోటానికి ఇంకా అవకాశం ఉంది. ఎందుకు దిద్దుకోగూడదు? నీవు తప్పు చేయనపుడు చక్క

బరచుకోనే ధైర్యం, సాహసం నీకే ఎక్కువవుంటుంది. కాంప్లెక్సులతో బాధపడవలసిన అవసరంలేదు. పుల్లయ్యగారి దగ్గరకు వెళ్ళదాము. గతం మరచి పొమ్మందాము. కాదంటాడా? ముక్కాలు ముప్పైసం కాదనడు. అంటే సంగతి తేలిపోతుందిగా! లే. బయలుదేరు.”

“బయలుదేర వలసిందేనా?”

“ఇంకా సందేహం దేనికి?”

“మరి మారువాడికి ఇవ్వవలసిన అయిదువేలు ఎవరిస్తారు?”

వాసుదేవశాస్త్రికి ఈ అంశమే అసలు మనస్సుకు తగలలేదు. అవును. ఆమొత్తం ఎవరిచ్చుకోవాలి? చిక్కొచ్చింది, అతడు కాసేపు ఆలోచించాడు.

“ఎవరిచ్చుకోనేదేముంది? పుల్లయ్యనే ఇచ్చుకోమని అడుగుదాము.”

“అతన్ని మళ్ళీ యాచించేదా? డాక్టరుగారు అసంభవం. చాలు. ఒకసారి పూచీయిచ్చి యింతవరకూ నుంచాడు. ఆ ప్రాయశ్చిత్తం చాలు. జన్మజన్మాలకు అతడు చేసిన ఘనకార్యం మరచిపోలేను. మళ్ళీ యిప్పుడు వచ్చి డబ్బు ఇచ్చుకోవలసిందని దేబిరించేదా? అది నావల్లకాదు. ఇంత విశ్వాసఘాతకుణ్ని ఊరకనే వదలిపెడతాననుకోవటం కల్ల. అతడేవచ్చి కాళ్ళమీదపడ్డా ఇప్పుడు నా కుటుంబం నేను ఇన్ని అవస్థలుపడి ఇంత అవమానంపాలైన తరువాత - రాజీ కుదరదు. మామ్మాటికీ కుదరదు.”

“శేఖరం! నా మాట విను. పెద్దవాణ్ణో చిన్నవాణ్ణో చెబుతున్నాను. ఒకసారి కోర్టుకెక్కితే ఆడే అబద్ధాలకు, చెప్పించే తప్పుడు సాక్ష్యాలకు అంతుండదు. అది అలా ఉంచి న్యాయస్థానానికి చెవులేగాని కళ్ళులేవు. ఆ తప్పుడు సాక్ష్యాలను బట్టే తీర్పు చెబుతుంది. ఎందుకు వచ్చిన లాయిలోసా? నా మాట విను. అతడైనా జైలుకు పోవాలి. నీవైనా జైలుకుపోవాలి. మీలో ఎవరైనా అసలు ఎందుకు జైలుకుపోవాలి? ఉభయులు హాయిగా స్వేచ్ఛగా ఎందుకు బ్రతకరాదు? ఉన్న అవకాశాన్ని పోగొట్టకు.”

“నాకెంత డబ్బుఉంది. నాకేమిటి-అని పుల్లయ్యగారు అనుకొంటూ ఉండాలి. అతగాడికి మంతనీగ, చిప్పతిండి తప్పటం కల్ల. అలా రాని ఉంటే మనమేమి చేస్తాము డాక్టరుగారు?”

"కేవలం తప్పు చేయకపోతే పగవాడిని ఉదారంగా క్షమించాలి. కాని ఇంత దారుణంగా ప్రవర్తించాడు. కాబట్టి వాడు ఫోర్జరీ చేసే చేసి ఉండవచ్చునేమో" అని శాస్త్రికి అనుమానం కలిగింది. అయినా చేసే దేమీ కనిపించక లేచి బయలుదేరాడు.

"డాక్టరుగారూ! ఇది కేవలం మా ఉభయులమధ్య వచ్చిన తగాదా కాదు. అలాంటిదైతే ఎలాగో సర్దుకొనేవాణ్ణి. అలాంటిది కాదు. వేల కొలది కార్మికుల జీవితానికి సంబంధించిన సమస్య. వాళ్ళనోటికాడి కూడు తీశాడు"

"అవును. ఇవాళ నాకు కడుపునొప్పివచ్చినా సామాజిక సమస్యే. రోగం వచ్చి మూలబడినా సామాజిక సమస్యే. తన వ్యక్తిగత సమస్యలను ఏకాంతంగా ఎదుర్కొని పరిష్కరించుకొనే దమ్ములులేక ప్రతివాడు వాటిని సమాజానికి అంటగడుతున్నాడు. సామాజికసమస్యలంటున్నాడు. సమాజం కోసం తాను త్యాగం చేస్తున్నానంటున్నాడు. నలుగురినీ రెచ్చగొడుతున్నాడు. దానితో వివేకాన్ని చంపి ఉద్రేకానికి నాగస్వరం పడుతున్నాడు"

"మీరెంత పురెక్కించినా పుల్లయ్యగారు అనుకొంటున్నట్లు నేను ఏకాకిని కాను. అంత వరకూ అదృష్టవంతుణ్ణే."

"ఇలాంటివాణ్ణి ఇంకా ఎందుకు దయదలచాలి" అనుకొని, శేఖరానికి సమాధాన మిచ్చాడు;

"అవును. తెలిసింది. కార్మిక సంఘం తిరిగి నెలకొల్పి ఉపన్యాసా లిస్తున్నావటగా !"

"పావుకార్ల సందర్శి కట్టుకొని కూలీలను ఏడిపించటానికి తయారవుతున్నప్పుడు ఏమి చెయ్యాలి ?"

శాస్త్రి అతని సమాధానం వినకముందే వెళ్ళిపోయాడు. తన అనుమానం కాదని త్రోసివేసి ఎన్ని హితోపదేశాలు చేసినా మానవునికి రుచించవు. ప్రాణాలు పోతున్నా అమోదించడు. శాస్త్రి మాటలు చంద్రశేఖరానికి తలదూరలేదంటే విడ్డూరమేముంది ?

శాస్త్రి వెళ్ళిపోయిన తరువాత కూడా శేఖరం అలాగే కూర్చున్నాడు. మళ్ళీ ఒకసారి డాక్టరన్న మాటలు మనోవీథిలో ప్రతిధ్వనిం

చాయి. అసలు శాస్త్రిగార్ని తన వ్యక్తిగత సమస్యను ఎదుర్కోలేక సామూజిక సమస్యగా చేసుకోవాలని కలవరపడ్డాడు, క్రిస్తు మరచిపోవటానికి అతని బుద్ధి, శాస్త్రి ద్రోహాల్ని వెదకటం మొదలుపెట్టింది. "శాస్త్రి బ్రాహ్మణుడు, బ్రాహ్మలంతా విప్లవద్రోహులే. వర్ణవ్యవస్థ యథాతథంగా ఉంచి తమ పెత్తనం కొనసాగించటానికి ప్రయత్నిస్తారు. కాబట్టి శాస్త్రికూడా విప్లవద్రోహి. ఈ సమాజం ఇలాగే ఉండటానికి ప్రయత్నిస్తున్నాడు. అలాంటి వాణ్ని ధిక్కరించి తాను విప్లవానికి తోడ్పడుతున్నాడే కాని అక్రమమార్గం త్రొక్కటంలేదు. ధనవంతులంతా తమకూడ కుట్రలుపన్ని కూలీలను వేధించుకుతినటానికి ఎలాగైనా జైలుకుపంపాలని చూస్తున్నారు. తాను వాళ్ళ ధనమదాంధతకు, కిరాతక కృత్యాలకు బలిఅవుతున్నాడు. అవును. కూలీల కోసం త్యాగం చేయటంకంటే మరొక వీరోచిత కృత్యమేముంది?" ఈ భావంతో తాను లోగడ వారికిచేసిన అపకారం మరచిపోయాడు. ఎక్కడలేని దాక్షిణ్యాం పుట్టుకొచ్చింది. వాళ్ళు సోదరులు. వాళ్ళకోసమే తాను ఇప్పుడు ఇన్ని చెరలకు లోనవుతున్నాడు.

ఇంతకూ శాస్త్రికూడా పాపకార్యంలో పరీక్ష అవుతున్నాడన్నమాట! కార్మికులు కాస్తతిరిగా ఉండటానికి కూడా అతనికి ఇష్టంలేదన్నమాట! శేఖరం పెదవికొరికాడు. ఎప్పుడైనా బ్రాహ్మలు బ్రాహ్మలే! ఈసంగతి కార్మికులకు చెప్పాలి. పుల్లయ్య యెంతమంది దేవుళ్ళకు మొక్కినా, ఎంతమంది బ్రాహ్మలకు సంతర్పణచేసినా జైలుమాత్రం తప్పదు. ఎటుతిరిగీ కేసు విచారణ ప్రారంభం రేపులేదు ఎల్లుండేకదా!

## 17

ఊరిలో బంధాలు దేరిన అరాజకత్వంతో పుల్లయ్యకు పూర్తిగా జంకు గొంకులు తీరిపోయాయి. అన్నం పున్నెం ఎరుగని తనపంతులుల్లా తగలపెట్టాడు. రెక్కల కష్టంతో జీవిస్తూవున్న ధర్మరాజులాంటి రైతాలయ్య చేత అన్యాయంగా నాలుగువందలు కక్కించారు. సంసారం గడుపుతున్న అతని ఆవుని అమ్మించారు. మల్లయ్య స్వామి తగలబెట్టించాడని అపవాదు వేశారు. చూస్తూ ఊరుకుంటే ఇంకా యెన్ని అన్యాయాలైనా చేస్తారు. ఈ అక్రమాలన్నీ పోయి ఊరు ఎప్పటి మాదిరిగా ఉండాలంటే తానికేసు

